# చిరంజీవులు

ఇది

చక్రావధానుల మాణిక్యశర్మగారిచే

రచియింపఁబడినది.



రెండవ కూర్పు 2000

ప్రకాశకులు,

వేంకటపార్వతీశ్వరకవులు.

పిఠాపురము.

1928 [వెల 0—10—0

# విషయసూచిక.



పుట.

సెను గాని యాతని కెక్కడను గోవు లభింపలేదు. తుదకాతఁడు చాలవిచారించి తనబాల్యసఖుఁడగు ద్రుపదునిపూర్వస్నేహము జ్ఞప్తికిఁ దెచ్చుకొని కుటుంబసహితముగాఁ బాంచాలమునకు బయలుదేఱి పోయి ద్రుపదమహారాజునకుఁ దనపూర్వస్నేహమునుదలంపునకుఁదెచ్చుచు సేవకముఖాలమునఁ దనయాగమనవార్త నెఱింగించెను. కాని, ద్రుపదమహారాజు రాజ్యమదముచేఁ బూర్వవృత్తాంతమును మఱచి యొకబీదబ్రాహ్మణుఁడు దనకు మిత్రుఁడని యంగీకరించుట తనగౌరవమున కుచితముకాదని భావించి ద్రోణాచార్యునకు దర్శనమైన నొసంగక పరాభవించి పంపివైచెను. ఇట్టియనుచితవ్యాపారముంగాంచి ద్రోణాచార్యునికోపము ప్రజ్వలించుటచేఁ దత్క్షణమే యాతఁడచ్చటినుండి వెడలిపోయెను.

పిమ్మటఁ గొంతకాలమునకు ద్రోణుఁడు హస్తినాపురమునకుఁబోయి తనబావయగు కృపాచార్యు నింట నుండి కాలక్షేపముచేయుచుఁ గ్రమముగా భీష్మనియోగంబునఁ గురుకుమారుల కస్త్రవిద్యాగురుం డయ్యెను. అచ్చటనే యశ్వత్థామ కూడఁ గురుకుమారులతోఁగలిసి తండ్రియొద్ద ధనురాగమము మొదలగు ననేకవిద్యలు నేర్చి మేటివిలుకాఁడై యొప్పుచుండెను. అశ్వత్థామ యీవిధముగా సర్వసద్గుణసంపన్నుఁడై యనవతరము మృణ్మయలింగమునుగావించి పరమేశ్వరారాధనముఁ జేయుచుండెడివాఁడు. కాని, యీతఁడు చిన్నతనమునుండియు

సులభకోపముగలవాఁడు; అధర్మమును సహింపఁజాలనివాఁడు; రణరంగమున వెనుకంజవేయనిమహావీరుఁడు. ఈతఁడు చిన్నతనమునుండియుఁ గురుపాండవులయెడల సమస్నేహభావముతోడనే మెలఁగుచుండెడివాఁడు.

కౌరవుల వంచనోపాయముచేఁ బాండవులకు వనవాసాయాసమును రాజ్యవినాశమును ఘటిల్లి తుట్టతుదకు మహాభారతరణము తటస్థించెను. ఆసమయమునందుఁ గౌరవులయధర్మప్రవర్తనము తనకసహ్యావముగఁదోఁచినను, ఆశ్రితధర్మమును బట్టియుఁ గృపద్రోణాదిగురుజనుల యాచరణమునుబట్టియు నశ్వత్థామ కౌరవపక్షముననే నిలిచి యుద్ధముచేయవలసినవాఁడయ్యెను. ద్రోణునియొద్ద విలువిద్య నేర్చికొన్నవారిలోఁ బ్రియశిష్యుఁడగు నర్జునుఁడును, బ్రియాపుత్త్రుఁడగు నీయశ్వత్థామయుమాత్రమే ద్రోణునంతటివారు కాఁగలిగిరి.అయినను వీరొకరిపైనొకరు స్పర్ధవహింపక యన్యోన్యగౌరవభావములనే కలిగియుండిరి. అందుచేతనేసమానప్రజ్ఞగలయీయిరువురును విరుద్ధపక్షములయందుండియు రణరంగమున నొకరినొకరెదిరించి యొకటిరెండు పర్యాయములకంటె నధికముగఁ దీవ్రయుద్ధమును గావించియుండలేదు. అప్పు డశ్వత్థామ యెంతటిమహావీరుడైనదియు నుభయపక్షములవారికిని విదిత మయ్యెను.

మహాభారతరణమునందు మిషతోఁగూడినధర్మరాజుమాట విని ద్రోణాచార్యుఁ డస్త్రసన్యాసముచేసెను. ఆసమ

యమునందు ద్రోణునిచంపుటకై జన్మించిన ద్రుపదకుమారుం డగు ధృష్టద్యుమ్నుఁడు ద్రోణునిశిరమునవలీలగ ఖండించివైచెను. ఈవార్త దూరమునందు యుద్ధముచేయుచున్న యశ్వత్థామకుఁ దెలియవచ్చినంతనె తోఁకఁద్రొక్కిన త్రాఁచువలె, నేయి వోసిననిప్పువలె మండిపడి పాండవులయధర్మప్రవర్తనమును గూర్చియు, ధృష్టద్యుమ్నునిపాపకృత్యముంగూర్చియు నిందింపుచు శీఘ్రకోపియగు నయశ్వత్థామ తండ్రిమరణించెననుదుఃఖముచే నోడ లెఱుంగక లోకము నపాంచాలముగాఁ జేసెదనని రారాజగు దుర్యోధను నెదుటఁ బ్రతిజ్ఞఁగావించెను.

అప్పు డశ్వత్థామయంతటిమహావీరుఁ డీవిధముగా నసాధారణమగుప్రతిజ్ఞ జేయుట నాలకించి పాండవసైన్యమంతయును గలగుండువడిపోయెను. కురుసేనలో నుత్సాహకోలాహలములు బయలుదేఱెను. అశ్వత్థామ ప్రళయకాలరుద్రునివలెఁగోపావేశముచే యుద్ధరంగమునఁ బ్రవేశించి సమంత్రకముగ నారాయణాస్త్రమును బాండవసేనపైఁ బ్రయోగించెను. ప్రజ్ఞావంతుఁడగునశ్వత్థామ యమ్మహాస్త్రము నట్లు ప్రయోగించినంతనే భూమండలమంతయుమలినమైపోయెను. మేఘములులేకుండఁగనే పిడుగులు పడనారంభించెను, మహావాయువులువీవఁదొడంగెను. సకలజీవులునుసంక్షుభితములైపోయెను, మండువేసవియందెండిన యడవింగాల్చు కారుచిచ్చువలె నారాయణాస్త్రము విజృంభించి పాండవసైన్యమును దహింప నారంభించెను. దానిబారినుండి

తప్పించుకొనుటకుఁ బాండవసైన్యమునం దెవ్వరికిని శక్తిలేక పోయెను.

ఆసమయమున భక్తపాలకుఁ డగువాసుదేవుఁడుపాండవపక్షమునందున్న యోధులనందఱింగాంచి "ఓమహావీరులారా! మీరు మీమీవాహనములనుండి దిగి విల్లమ్ములవిసర్జించి భక్తిపూర్వకముగా నా నారాయణాస్త్రమునకు నమస్కరింపుఁడు. అట్లుచేయని-చో మీకు నిష్కృతిలేదు" అని యుపదేశించెను. ఆసదుపదేశము ననుసరించి యోధులందఱును దమతమయస్త్రములను ద్యజించివైచిరి. బలగర్వితుండును మహాబలసంపన్నుండు నగుభీముఁడుమాత్రము కృష్ణునిమాటలఁ బాటింపక తనయరదము నశ్వత్థామ కెదురుగ నడపించి యాతనిపై ననేకమహాస్త్రములఁ బ్రయోగింప నారంభించెను. అంతలో ననివార్యమగునారాయణాస్త్రజ్వాలలచే రథసహితముగ భీమసేనుఁడు కప్పఁబడిపోయెను. పాండవసేనయం దాహాకారములు బయలుదేఱెను. తోడనే కృష్ణార్జునులు పరుగుపరుగునఁబోయి యరదమునుండి భీమసేనుని బలవంతముగఁ గ్రిందికి దింపివైచి యాతనిచేతనున్నయస్త్రశస్త్రములను లాగివైచిరి. అప్పటికి నారాయణాస్త్రము ప్రశాంతమయ్యెను. ప్రియశిష్యుఁడగునర్జునునికంటెఁ బ్రియపుత్త్రుఁడగు నశ్వత్థామకు ద్రోణాచార్యుఁడు ప్రత్యేకముగనొసంగిన యధికశక్తి యిదియే.

అశ్వత్థామ తనదివ్యాస్త్ర మట్లు వమ్మగుటకుఁజింతించి బిరాన వ్యాసునిచెంత కరిగి నాయస్త్రంబిట్లువ్యర్థమగుటకు హేతు వెయ్యదియో యానతిమ్మని ప్రార్థించుటయు వ్యాస భగవానుఁడు "ఓద్రోణనందనా! పూర్వము నారాయణుండు లోకరక్షణార్థ మవతరింపనెంచి మైనాకపర్వతంబున నిరాహారియై శివునిఁగూర్చి పెద్దకాలంబు తపంబుసేయ నా బాలశశాంక మౌళి ప్రత్యక్షమై యతనియభీష్టముఁ దెలిసికొని నీవు సురాసురగరుడగంధర్వనాగప్రముఖుల నవలీల గెలువఁగలవని వరంబిచ్చి యంతర్హితుం డయ్యెను. అందువలన నారాయణున కట్టిశక్తి కలిగినది. ఆనారాయణుఁడే యీశ్రీకృష్ణుఁడు. ఆనారాయణాంశసంభవుఁడగునరుఁడే యీయర్జునుఁడు. వారిరువురును గేవలలింగాధిష్ఠాతయగుమహాదేవు నర్చించిన మహాశీయులు. నీవు పార్థివలింగమును బూజించుచుండుటచే నట్టిశక్తి నీయందుఁ గలుగలేదు. అంతియకాక, వారు నారాయణాంశ సంభవులు. నీవు ప్రయోగించినది నారాయణాస్త్రము. వారిచేతితో వారినిగొట్టిన నెంతప్రయోజనమో వారిపైఁ బ్రయోగించిననారాయణాస్త్ర మంత ప్రయోజనమైనది." అనిప్రబోధించుటయు నశ్వత్థామ పులకితాంగుఁడై వ్యాసదేవునకు నమస్కరించి కృష్ణార్జునులప్రభావమును మెచ్చుకొనుచుఁ దనశిబిరంబున కేఁగెను.

పగదీర్చికొనఁ దలఁచినవానికిఁ దనప్రయత్నములు విఫలములైనకొలఁదిని కోపానలము ప్రజ్వలించిపోవుచుండును. మహావీరుఁ డగునశ్వత్థామకుఁగూడ నిట్లే పాంచాలురను నాశనము చేయువఱకును గోప ముపశమింపలేదు. ఆతఁ డెంతపట్టుదలతోఁ బనిచేసినను గార్యము కొనసాగుటలేదు. ఆతనికిఁ గృష్ణార్జునులయం దెంతగౌరవ మున్నను బాండవు లక్రమముగఁ మహాపురుషులగు భీష్మద్రోణులను సంహరించిరనువిషయము తలఁచికొన్నప్పు డాతనియొడలు కంపించిపోవుచుండెను. క్రోధము హెచ్చిపోవుచుండెను. ఆయపచారమునకు వారికిఁ దగినశాస్తి చేయువఱకు నాతనికిఁ దోఁచుటలేదు.

ఇట్లుండఁగా రణరంగమున రాజరాజునకుఁ బ్రధానాధారస్వరూపుఁడైనకర్ణుఁడు పార్థశరానలమున కాహుతియై పోయెను. ఆవార్త నాలకించినంతనే యశ్వత్థామ హతాశుఁడయ్యెను తానుసర్వసేనాధిపత్యమును వహించి యెట్లయినఁ బాండవులను జయించి పాంచాలుర నాశనముఁగావించి తన ప్రతిజ్ఞఁదీర్చికొనవలయునని యెంతయో యాత్రపడుచుండెను. అందులకై మహారాజుదుర్యోధనుఁడు దప్పక తన్నుఁ బిలిపింపఁగలఁడని యాతఁ డారాత్రియంతయు నాలోచించుకొనుచు నెదురుచూచుచుండెను. తెల్లవాఱినదిగాని, రారాజాతని నాహ్వానింపనేలేదు. శల్యుని సర్వసేనాధిపత్యమునం దభిషి

క్షుని గావించిన ట్లాతనికిఁ దెలియవచ్చెను. అప్పు డశ్వత్థామ కాశాభంగమైనను మహావీరుఁడుగావునఁ బట్టుదలను విడువక నిస్సంశయముగ సమరరంగమునఁ బ్రవేశించెను. తనయంతటి సమర్థుఁ డుండఁగా సుయోధనుఁడు తన్ను గౌరవింపకపోయినను గార్యతత్పరుఁడైయున్నయశ్వత్థామ కది పరాభవముగా దోఁపలేదు. అందుచే నాతఁ డెప్పటివలెనే యుద్ధముచేయుటకుఁ గృతనిశ్చయుఁ డయ్యెను.

ఆమధ్యాహ్నసమయమున మహారణమధ్యమునందు సేనాధిపతియగుశల్యుఁడు గాండీవిబాణవర్షమునఁ బడి మునిఁగి పోవుచుండెను. స్వపక్షాభిమానియు దీక్షాపరుఁడు నగుద్రోణ నందనుండు శల్యునిరక్షించుటకై తనబలపరాక్రమముల వినియోగించెను. ఇంతలో శల్యుండు భగ్నరథుండై పోవుటయు నశ్వత్థామ యాతనిఁ దనస్యందనముపై నిడికొని పార్థు నెదిర్చి మహాయుద్ధముచేసిశల్యునుద్ధరించుకొనియెను. కానివిధివశముచే నానాఁడు శల్యునకు మరణము తప్పినదికాదు. శల్యుఁడట్లుసురక్షితుఁడై వేఱొకరథము నధిరోహించి యాసమీపమునందున్న ధర్మరాజుతోఁ బోరాడఁదొడంగెను. ఆపోరునందుఁ దుద కామద్రరాజు ధర్మరాజుదివ్యశక్తిచే నిహతుఁడైపోయెను.

మాటిమాటికిని నిరాశకలుగుచుండుటచే నశ్వత్థామ యధైర్యముచేఁ గ్రుంగిపోవక కార్యోత్సాహముఁ దన్నుఁ బురికొల్పుచుండ సమరాంగణమున నతిదారుణముగ వీరవిహా

రముఁ గావింపఁదొడంగెను. ఇంతలో భీమసేనుని యన్యాయ
యుద్ధమునందు రారాజగుదుర్యోధనుఁడు తొడలువిఱిగి పడి
పోయెను. అప్పు డశ్వత్థామ తనప్రతిజ్ఞ నెఱవేఱకుండుటయుఁ
దనపక్షమంతయు దుర్బలమైపోవుటయుఁ దనకన్నులయెదుటనే
తనప్రభువగు రారాజు పడిపోవుటయుఁ బితృహంతకులగు పాం
చాలు రింకను బ్రదికియుండుటయుఁ బాండవు లక్రమప్రవర్త
కు లగుటయుఁ గాంచి కోపమును సంతాపమును శోకమును
మాత్సర్యమును దన్ను ముంచివేయుచుండ నున్మత్తునివలె
రారాజుసమీపమునకుం బోయి క్రోధశోకగద్గదస్వరంబున
"మహారాజా! విధివిధానము తప్పినదిగాదు. జరగినదానికి విచా
రించుటవలనఁ బ్రయోజనము లేదు. నేను ప్రతిజ్ఞాపూర్వకముగ
మరల వచించుచున్నాఁడను వినుము. ఏవిధముగానైన వాసుదే
వునిసమక్షమునందు సమస్తపాంచాలగణంబులను శమనసదనం
బున కతిథులుగాఁ జేసివైచెదను. ప్రభుండవగు నీవు నాకనుజ్ఞ
యొసంగుము." అని విన్నవించుటయు, నలసుఁడై ప్రాణావ
శిష్టుఁడై పడియున్న మహారాజు దుర్యోధనుఁడు కృపాచార్యునిం
గాంచి "భూసురాగ్రణీ! మీకు నాయెడలఁ బ్రేమయే యు
న్నచో ద్రోణనందనుండగు నీయశ్వత్థామ నీక్షణమునందే సేనా
పతిపదంబున కభిషిక్తుంగావించెదరుగాక! రాజాజ్ఞచే క్షత్రియ
ధర్మము నవలంబించిన బ్రాహ్మణునకు యుద్ధముచేయుట దోష
ముగాకుండుఁగాక!" అని యాజ్ఞాపించుటయు మహావీరుండగు

కృపాచార్యుం డప్పుడే ప్రభుశాసనమును సక్రమముగా నిర్వర్తించెను.

అనంతరము ద్రౌణి కృపకృతవర్మలతోఁ గలసి యనతి దూరమందున్న కురుక్షేత్రమహావనంబునఁ బ్రవేశించెను. అచ్చట నమ్మువ్వురువీరాగ్రేసరులును నొకవటవృక్షముక్రిందఁ గొంతసేపువిశ్రమించి గుఱ్ఱములచే జలపానంబు సేయించి ముందుచేయఁబోవుకార్యములనుగూర్చి యాలోచించుకొనుచుండిరి. సాయంకాలమయ్యెను. క్రమముగా నంధకారము దశదిశల నలముకొనియెను. గ్రహతారకలచే గగనమండల మలంకృతమయ్యెను. వనమధ్యమున ఘాతుకమృగములు విచ్చలవిడిగ సంచారము చేయనారంభించెను. తక్కినజీవకోటి యంతయు నిద్రాముద్రితమైపోయెను. అప్పు డమ్మువ్వురును నాచెట్టుక్రిందఁ గూరుచుండి శోకాకులచిత్తములతోఁ గౌరవ పాండవులవినాశనమునుగూర్చి వితర్కించుకొనుచుండిరి. గమనాయాసముచేతను, శస్త్రఘాతములచేతను మిగులనలసి యున్నవారిని నచిరకాలములోనే నిద్రాదేవత యాక్రమింపఁ దొడంగెను. ఇదివఱ కెన్నఁడును దుఃఖమన నెట్టిదియో యెఱుఁగని కృపకృతవర్మలు దీనులవలె ధరాతలమునంబడి నిదురించిరి.*

కాని, ప్రతిహింసానలజ్వాలలచే దహించుకొనిపోవుచున్న హృదయముగల యశ్వత్థామకుమాత్రము నిద్రాదేవత

సుఖ మీయఁజాలకపోయెను. వలలోఁదగుల్కొన్నపక్షివలె నాతనిహృదయము కొట్టుకొనిపోవుచుండెను. అప్పు డాతఁడు నలుదెసలఁ దిలకించి లోపలను వెలుపలనుగూడ నంధకారమునే కాంచుచుండెను. ఆసమయమునందు వృక్షశాఖాంతరాళమునఁ బక్షులఱెక్కలచప్పు డాతనికి వినవచ్చెను. మఱియుఁ గురుబురుగులసన్నని వెలుఁగులో నొకగుడ్లగూబ యాతనికి దృగ్గోచరం బయ్యెను. అది నిదురించుచున్నకాకులగొంతులఁ గొఱుకుచుఁగొన్నిటినఖంబులఁ జీల్చుచుఁ గడుపారభక్షించుచు నిశ్శబ్దముగ నాచెట్టుపై వీరవిహారముసేయుచున్నట్లాతనికిఁ గానవచ్చెను. వాయసాంతకమగునులూక మీవిధముగా రాత్రివేళఁ దనకార్యసిద్ధిం గావించుకొనుచుండుటం గాంచి యశ్వత్థామ కొడలు తెలియని యావేశము కలిగెను. అప్పుడాతఁడు తనలో "ఈయులూకము నాకిపుడు గురువై నాప్రతిజ్ఞానిర్వాహణమునకు మార్గముచూపినది. శత్రుసంహారమున కిదియే యుచితసమయము. నేనిప్పుడు నారాజునెదుటఁ బాండవవినాశముంగావింతు నని ప్రతిజ్ఞ చేసితిని. కాని, బహిరంగముగ నెదురించి వారిని జయించుట యసాధ్యము. ధర్మయుద్ధమునఁ బ్రాణత్యాగము సేయుటకంటెఁ గపటోపాయముచేనైన శత్రుసంహారముఁగావించిమహారాజుఋణమునుదీర్చిస్వధర్మనిర్వాహణమును గావించుకొనుట యుచితము." అని యింకను ధర్మాధర్మములం గూర్చి యెన్నియోవిధంబుల వితర్కించుకొని తుదకు శత్రుసంహారముచేయుటయే యవశ్యధర్మముగా నిశ్చయించుకొని

ఖడ్గహస్తుఁడై లేచి ముందటికి నాలుగడుగులు నడచి "విక్రమధనులైన కృష్ణార్జునులున్నచోటికి నొంటిగాఁ బోవుట యుచితము కాదు. మామను, గృతవర్మనుగూడ లేపెదను." అనియూహించుకొని కృపకృతవర్మలను జాగరితులను గావించెను.

అప్పుడు కృపాచార్యుఁడు లేచి "కుమారా! నీకింకను నిదురపట్టనేలేదా? ఈయసమయమునందు ఖడ్గము నేలధరించితివి?" అని యడిగెను.

అశ్వ—మామా! నానారాజకిరీటమణినీరాజితపాదపీఠుఁడైన రారాజావిధంబున భగ్నోరుద్వయుండై భండనరంగమునఁ బ్రాణావశిష్టుఁడై పడియుండ నాకురుకులతిలకుని ప్రసాదమున జీవించుచుఁ గృతఘ్నుఁడనై నేనెట్లునిద్రింపఁగలను?

కృప—వత్సా! నీవుచెప్పినది యథార్థము. ప్రభుభక్తి నెఱపుట మనకు ధర్మమే. అయినను స్వయంకృతాపరాధమను మహాప్రవాహమునంబడి కొట్టుకొనిపోవుచున్న సుయోధనుఁడనునెండుకట్టియను మరలించి తీరమునకుఁ జేర్చుట బ్రహ్మాదులకైనను శక్యము గాదన్నచో మనమా యాతని నుద్ధరింపఁగలవారము?

అశ్వ—మామా! నీమాటసత్యమే. కాని, శిఖండిని ముందుంచుకొని యన్యాయముగ భీష్మునిఁ జంపిమహాపాపులను—అనృతవచనములచే నస్త్రసన్యాసముచేయించి యక్రమముగా నాజనకుని యుత్తమాంగము నుత్తరించిన కిల్బిషావ

తారులను—సంగరమధ్యమున శాపోపహతిచే భూమిలోఁ గ్రుంగిన తేరు నెత్తుకొను సమయమున నధర్మమని సుంతయును దలంపక కర్ణునిఁ దెగటార్చిన పాపవ్యవసాయపరులను—పాండవపక్షవీరులను బంధుమిత్రపరివారసహితముగా నొక్కసారి నాక్రోధరసప్రవాహమున ముంచివైచి యమలోకంబువఱకును గొట్టుకొనిపోవునట్లు చేయువఱకును నాకు శాంతి యెక్కడిది? రారాజుమాట యటుండనిమ్ము—పాపు లెవ్వరైనను దమకర్మఫలము ననుభవింప వలసినదే. తొలుదొల్త గౌరవులే పాపవ్యవసాయమునకుఁ గడంగుటచే వారిదే పాపపక్ష మైపోయినది. అందువలనఁ గౌరవులు దండ్యులైరి. భీష్మద్రోణాదిధర్మవేత్తలును, వేదవ్యాసాదిమహర్షులును, ప్రబోధించినను వినకుండుటచే దుర్యోధనుఁడు మూర్ఖుఁ డయ్యెను. అట్టివాని నేయుపాయంబుననో కడతేర్చుట పాండవుల కవశ్యకర్తవ్యమయ్యెను. కాని, నిరపరాధులైన భీష్మద్రోణాదిగురుజనంబుల నన్యాయంబుగ వధించిన పాపాత్ములగు పాండవుల నేమిచేసిన పాపమున్నది? ఇన్నిమాటలేల? కేవలఋజుమార్గప్రవర్తకుఁడని పేరువడసిన ధర్మజునంతటివాఁడు కపటతంత్రమునకు లోఁబడి అశ్వత్థామ మరణించెనని యనృతమాడి తనకుఁబితృస్వరూపుఁడగు నాజనకుని దుర్మరణమునకుఁ గారకుఁ డయ్యెనుగాదా? అట్టిపాపకర్ము నెట్లయినను ససైన్యముగఁ బరిమార్చుట పాపము గానేరదు. నేనట్టివిశ్వాసముతోనే కృతనిశ్చయుఁడ నై

యుంటిని. కురురాజు ప్రాణములతో నుండఁగనే యశ్వత్థామ విశ్వాసపాత్రుఁడై సంపూర్ణముగాఁ దనప్రతిజ్ఞను సాధింపఁగలిగెనను మనఃప్రియమైనవార్త యాతనిచెవులఁబడవలయును. సమయము దొరకినప్పుడు శత్రువులను వధించుటయే యంగీకృతక్షత్రధర్మండ నగునాకుఁ గర్తవ్యము. అర్ధరాత్రిసమయంబున నిదురించుచున్న కాకులంజంపి తినుచున్నయులూకమును నాకన్నులయెదుటఁ బెట్టి పరమేశ్వరుఁడు శత్రువినాశనంబునకు నాకు ముఖ్యోపాయమును బ్రబోధించి యున్నాఁడు. నేనీరాత్రియే పాండవశిబిరంబులఁ బ్రవేశించి నిద్రానిమగ్నులై యుండు పాంచాలురను, బాండవసంతానంబును ససైన్యముగఁ దుదముట్టించి కసిదీర్చుకొని ప్రభుఋణమును, తండ్రిఋణమును జెల్లించుకొనియెదను. అంతవఱకును నాయీకృపాణ మొఱయందుఁ బ్రవేశింపదు. మీరును బ్రభుభక్తితత్పరులైనచో నావెంటరండు. ఆకస్మికముగ నాపైఁదలపడినవారి నడ్డగించుటకై సాహాయ్యముచేయుఁడు. ఈదారుణకర్మమున కంతకును నేనే ప్రధానుఁడ నయ్యెదను. ఈవిషయంబునఁ బాపపుణ్యములతో నాకెంతమాత్రమును బ్రసక్తిలేదు. ఇక్కార్యము సిద్ధించువఱకును నాక్రోధమునకు శాంతిలేదు. ఎంతయుడఁచికొందమన్నను నాఁగక కార్యోత్సాహము నన్నుఁ బురికొల్పుచున్నది. బ్రహ్మవంశమున జన్మించి క్షత్రధర్మము నవలంబించిననాకీవిషయమున నెట్టిసంశయమును గలుగుటలేదు. వంచకులను వం

చనముచేతనే జయింపవలయును. భగవదుద్దేశ మెట్లుండునో యట్లుజరుగకమానదు. మనము నిమిత్తమాత్రులము. మనకెం దును గర్తృత్వములేదు.

ఇట్లశ్వత్థామ యున్మత్తునివలె సంభాషించుటయుఁగృప కృతవర్మలు కళంకశంకితులై నిద్రించుచున్నజీవులను బలవంత ముగ సంహరించుట వీరధర్మముకాదనియు మహాపాపమనియు నెన్నియోవిధములఁ బ్రబోధించిరి. కాని, ద్రౌణి వారివచనం బులఁ బెడచెవులంబెట్టి క్రోధావేశముచేఁ దూలుచుఁ బాండవ శిబిరంబుల కభిముఖుఁడై పోవఁదొడంగెను.కృపకృతవర్మలిఁకఁ జేయునదిలేక సహాయార్థమై దూరదూరముగ నాతనివెన్నంటి పోయిరి.

క్రమముగా నశ్వత్థామ పాండవశిబిరములను సమీపిం చెను. అప్పుడు పునుకలపేరులను సర్పభూషణములను ధరించి నరయొకభూత మాతనికట్టెదుట నిలిచి తనకరాళవదనగహ్వర మును దెఱచి భువనంబుల నన్నిటిని దిగమ్రింగున ట్లార్భాట ములు సేయఁదొడంగెను. దారుణకర్మాచరణమునందుఁ దదేక నిష్ఠుఁడైయున్నయశ్వత్థామ యాభూతముంగాంచి సుంతయును భీతిల్లక దానిపై నిశితనారాచంబుల నవార్యరిగాఁ బ్రయోగిం చుటయు నది యాబాణముల నవలీలగ మ్రింగివేయసాగెను. అశ్వత్థామ యాశ్చర్యముతో నాభూతమువంక దృష్టినిగుడించుట యు దానిముఖంబునశంఖచక్రగదాద్యాయుధహస్తులగునారా

యును లనేకులు పొడకట్టి యాతనికి గమననిరోధంబుఁ గావిం చిరి. అయినను ద్రోణనందనుం డించుకంతయును జలింపక వివిధంబులగు దివ్యాస్త్రములను బ్రయోగింపసాగెను. కాని, యవియన్నియు భూతగర్భమున విలీనములై పోవుచుండెను.

అప్పు డశ్వత్థామ నిశ్చేష్టుఁడై యంతలోఁ దెలివి తెచ్చుకొని పౌరుషముకంటె దైవము బలీయమైనదని నిశ్చయిం చుకొని తత్క్షణమే రథమునుండిదిగి సర్వభూతనాథుండునువిశ్వే శ్వరుండు నగునారుద్రదేవుని మనంబునధ్యానించి యనేకవిధం బులఁ బ్రస్తుతింప నారంభించెను.

అంతలో నాభయంకరభూతం బంతర్ధానంబై యెట్టయెదుట మంటలతోఁ బ్రజ్వరిల్లుచున్న యొకకనకవేదిక యాతనికిఁ గానవచ్చెను. అప్పు డశ్వత్థామ యుచ్చస్వరముతో "ఓపరమే శ్వరా! ఈజగంబులు సృష్టించుటకును, పాలించుటకును, సంహా రించుటకును నీవేకర్తవు. నీవిలాసము లనంతములు, నీవు భావా తీతుఁడవు. నీలీలలయర్థంబుఁ దెలియ నేనసమర్థుండను. నీకిప్పుడే యాత్మోపహారంబు సేయుటకుఁ గృతనిశ్చయుఁడనై యున్నాఁ డను." అనిపలుకుచు ద్రోణనందనుండు సాహసించి తనయా యుధముల నన్నిటి నాయగ్నికుండంబున కాహుతిఁ జేసి తన హృదయపద్మమునందు సదాశివమూర్తినిఁ బ్రతిష్ఠించుకొనినిశ్చ లచిత్తముతో నిస్సంశయముగా నాయగ్నికుండమునఁ బ్రవేశిం చెను. కాని, యాయగ్నిజ్వాల లశ్వత్థామకుఁ జందనజలంబుల కంటెను నతిశీతలంబులైపోయెను.

వీరాగ్రేసరుండగు నశ్వత్థామ భక్తిసాహసధైర్యంబుల కుమెచ్చి యాదిదేవుండగు పరమేశ్వరుండు ప్రీత్యత్కుడై "ద్రోణనందనా! నివర్పించిన యాత్మోపహారంబునకుఁ బ్రమోదంబు నందితిని. నీయభీష్టవరంబు లొసంగెద నర్థింపుము." అని కరుణా కటాక్షమాలికలచే నాతని నలంకరించెను. అప్పు డశ్వత్థామ సంభ్రమంబున నవ్వేదిక వెడలివచ్చి యాయభవు పాదపద్మము లకుఁ బ్రణామంబుచేసి సంస్తుతించుటయుఁ బినాకపాణియాతని నాదరించి "వత్సా! సత్యశౌచపరుండవై నిశ్చలభక్తితో నన్నారాధించు కృష్ణునకు మేలుసేయందలంచి భూతాకృతితో నీకునిరోధకుండ నైతిని. నీచిత్తశుద్ధిని శోధించుటకై యిట్లనేకమాయల నొనర్చితిని. పాంచాలురకుఁ గాలం బాసన్నంబైనది. అప్రతిహతంబగు నీఖడ్గమును బరిగ్రహించి కృతకృత్యుండ వగు" మని యనుగ్రహించి యాతనిశరీరంబు తనపవిత్రకరకమలంబులచే నిమిరి "కుమారా! నీవసమానప్రభావసంపన్నుండవై చిరంజీవివై మను" మని యాశీర్వదించి యంతర్హితుండయ్యెను. మున్ను భూతంబుచే నపహృతంబులైన యస్త్రశస్త్రంబులును, తా నగ్ని కుండంబున వేల్చిన యాయుధంబులును మరల నశ్వత్థామను జేరుకొనియెను.

ఇట్లు లబ్ధాభీష్టుండైన గురునందనుండు మహానందపరవశుండై మహాబలసంపన్నుండై యాశ్వరదత్తంబగుదివ్యకృపాణా

బును జళిపించుచు వెనుకనున్న కృపకృతవర్మలంజూచి "వీరవరు లారా! మీరును వెంపువహించి నాతో నింతవఱకు వచ్చినం దులకు సంతసించుచున్నాఁడను. ఇఁక మీరు వెనుకంజవేయక జాగరూకులై యుండుఁడు" అని హెచ్చరించి, ఆయిరువురను శిబిరద్వారదేశంబున నిలిపి తాను నిశ్శబ్దముగా ధృష్టద్యుమ్నుని శయనాగారమునఁ బ్రవేశించెను. ధృష్టద్యుమ్నుఁడు విజయో త్సాహముచే నిర్భయముగా మైమఱచి నిద్రించుచుండెను. ఆ తనింగాంచినంతనే క్రోధపరవశుం డగునశ్వత్థామ యొక్కత న్నుఁదన్ని నిద్రనుండి మేల్కొల్పి మదమాతంగముపై నుఱుకు సింగమువలె నాతనిపైఁబడి యాతని నతిదారుణంబుగ బాధిం చి పశువును జంపినట్లుచంపివైచెను. ఆభయంకరకోలాహలము నాలకించి శిబిరములోని వారందఱును మేల్కాంచితత్తరపాటు తోఁ దమతమయాయుధముల వ్యత్యస్తంబుగఁ గైకొనివచ్చి యశ్వత్థామను దలపడిరి. శివవరప్రభావముచే మత్తిల్లియున్న ద్రోణనందనుండు, యుధామన్యుఁడు,ఉత్తమౌజుఁడు మొదలగు పాంచాలురను దనఖడ్గధారకు బలిగావించి రక్తధారలచే దొ ప్పఁదోఁగుచున్న శరీరముతో నతిభయంకరముగ సంచరించుచుఁ దనకంటఁబడినవారి నెల్లఁ జిత్రవధ గావింపఁజొచ్చెను. ప్రతివిం ధ్యుఁడు, శ్రుతసోముఁడు, శతానీకుఁడు, శ్రుతకర్ముఁడు, శ్రుతకీ ర్తియనుద్రౌపదీపుత్త్రు లేవురునుఁగూడ నాతని దారుణఖడ్గ ధార కెఱయై పోయిరి. క్రమముగా నాతఁడు శిబిరంబులఁ

బ్రవేశించి మిగిలిన పాండవసేననంతను నాశనముఁ గావించె ను. అశ్వత్థామను దప్పించుకొని పాఱిపోవుచున్న యోధులను విధిప్రేరణంబునఁ గృపకృతవర్మలు ద్వారంబునఁగాచి సంహ రించుచుండిరి.

ఈవిధముగా నశ్వత్థామ జగత్సంహారముసేయు ప్రళ యకాలరుద్రునివలె విజృంభించి శత్రువినాశనంబుఁ గావించి యంతటఁ దనివిసనక యాశిబిరంబులన్నియు దగ్ధంబులుగఁ జేసి పితృమరణజనితంబగు క్రోధానలమును శత్రురక్తప్ర వాహంబుచేఁ జల్లార్చుకొని యచిరకాలంబుననె కృపకృతవర్మ లంగలిసికొని కురురాజగు దుర్యోధనునిపాలికింబోయి యావృ త్తాంతము నివేదించెను. దుర్యోధనుండును బరమాహ్లాదంబున నావీరులఁ గౌఁగిలించుకొని ప్రశంసించుచుఁ బ్రాణములను విడిచెను.

తెల్లవాఱినది. అశ్వత్థామ యొనరించిన దారుణకృత్య ము పాండవులకుఁ దెలియవచ్చెను. తనపితృకులంబంతయు విన ష్టంబగుటయేకాక నిజసంతానంబుగూడ వినాశంబగుటచే ద్రౌ పది దుస్సహశోకావేగంబున మూర్ఛపడిపోయెను. అప్పుడు రజోగుణప్రధానుండును వీరుండునగు భీమసేనుండు ద్రౌపదిని మూర్ఛఁదేర్చి యూరార్చుచు దురాత్ముండును బుత్త్రహంత కుండు నగు నశ్వత్థామను బరాభవించి యతని శిరోరత్నంబు దెచ్చియిచ్చెద నని ప్రతిజ్ఞచేసి కాంచన రథారూఢుండై

నకులసహితంబుగా నశ్వత్థామను వెంబడించుటకు బయలుదేఱెను.

అప్పుడు శ్రీకృష్ణుఁడు ధర్మజునుద్దేశించి "మహారాజా! నీతమ్ముఁడగు భీముఁడు ద్రౌపదిశోకమునుజూడఁజాలక సాహస కర్మముంగావింపఁ బోవుచున్నాఁడు. ధనుర్విద్యావిశారదుండగు ద్రోణుఁడు తనకుమారుఁ డగునశ్వత్థామకుఁద్రిలోకభీకరంబగు బ్రహ్మశిరోనామకాస్త్రమును బ్రసాదించియున్నాఁడు.అందుచే నాతఁడు దేవగణంబులకుఁగూడ నజేయుఁడు. కావున భీమ సేనుఁ డిప్పు డాతనిచేతులలోఁ బడిపోకుండ రక్షింపుకొనవల యును." అని యుద్బోధించి రథము నాయత్తముచేసి కిరీటి తోఁగూడ ధర్మజుని వెంటఁబెట్టుకొని బయలుదేఱెను. ఇట్లా ముగ్గురును గొలఁదికాలములోనే భీమసేనుని గలసికొని క్రోధోద్ధతుఁడగు నాతనిప్రయత్నమును మరలింపఁజూచిరి. కాని, వృకోదరుఁడువారిమాటలు వినక యశ్వత్థామను వెదకికొనుచు భాగీరథీతీరమువఱకును బోయెను. ధర్మజుఁడును గృష్ణార్జును లునుగూడ దూరమునుండి యాతని ననుసరించియే పోవు చుండిరి.

గంగాతీరమునందు వ్యాసాదిమహర్షుల సన్నిధానమున నశ్వత్థామ కుశాంబరధారియు, ధూళిధూసరితగాత్రుండునై కూర్చుండియుండెను. ఆతనింగాంచినంతనే మహావీరుండగుభీమ సేనుండు క్రోధోద్రిక్తుండై శరాసనంబున బాణసంధానంబుచేసి యతిత్వరితగమనంబున "లెమ్ము, రమ్ము; యుద్ధమునకురమ్ము"

అని ధిక్కరించుచు నాతని నెదుర్కొనెను. ఆకస్మికముగ నెదుర్కొనిన భీమసేనునింగాంచి మహారథికుండగు నశ్వత్థామ తత్తరముతో లేచి మరల యుద్ధము తటస్థించినదని వితర్కించియేకాకియైయుండుటచే నేమియుందోఁపక బ్రహ్మశిరోనామకాస్త్రమును ద్రుణసంయోజితంబుగఁ జేసి "పాండుకులక్షయంబగుఁగాక!" అనిపలుకుచుఁ బ్రయోగించెను. తోడనే యాదివ్యాస్త్రమునుండి త్రిలోకంబులను దహింపఁజేయునంతటియగ్నిజ్వాలలు బయలుదేఱెను.

మహాభాగుండగుమాధవుండు దూరమునుండియే యది యంతయుఁగాంచి ధనంజయు నవలోకించి "సఖా! ద్రోణోపదిష్టంబగు నొకదివ్యాస్త్రము నీయొద్ద నింకను ననుపయుక్తంబై యున్నయది. ఆదివ్యాస్త్రము నిప్పుడు ప్రయోగించి నీవంశము నుద్ధరించుకొనుము." అని ప్రబోధించెను. అర్జునుండప్పుడురథావతరణంబుఁ గావించి ప్రప్రథమంబుననేఅశ్వత్థామకును,తనసోదరులకును, శుభంబగుఁగాక యనివచించి గురువునకును దేవతలకును నమస్కారంబుచేసి "ఈయస్త్రప్రభావంబుచేనశ్వత్థామదివ్యాస్త్రము మరలింపఁబడుఁగాక!" అని సమంత్రకంబుగాబ్రహ్మశిరోనామకాస్త్రంబును బ్రయోగించెను.తోడనేయాదివ్యాస్త్రంబుల రెండింటినుండియుఁ బ్రళయకాలానలజ్వాలలు ప్రజ్వరిల్లఁదొడంగెను. ఆకసమునుండి వేలకొలఁది యుల్కాపాతములు కాఁజొచ్చెను. సకలజీవగణంబులును భయభ్రాంతములై పోయె

ను. సాగరవలయితంబును గిరికాననపూర్ణంబును నగుధరామం డలమంతయును గంపించిపోవుచుండెను.

అట్లాదివ్యాస్త్రములు రెండును గలిసి త్రిజగంబులను దహించివేయునో యనుభయమునచే సర్వభూతహితార్థియగు వేదవ్యాసుండును దేవమునీంద్రుండగు నారదుండును వారిన డుమఁ బ్రవేశించి లోకసంరక్షణార్థమై మీమీయస్త్రముల నుపసంహరింపవలయునని ప్రబోధించిరి. అప్పుడు సాధుశీలుం డగునర్జునుండు వారికి నమస్కరించి "మునిశ్రేష్ఠులారా! నేనీ యశ్వత్థామయస్త్ర వేగమునుపశమింపఁజేయు నుద్దేశముతోడనే నేనునాదివ్యాస్త్రమును బ్రయోగించితిని. ఇప్పుడు నేను దీని ను పసంహరించినచో నీయశ్వత్థామ నిశ్చయముగఁ దనయస్త్రప్ర భావముచే మమ్మందఱ భస్మీభూతులంగావించివైచును. కావున నందఱకును శుభంబగునట్టి యుపాయము నాలోచింపవలయు నని వేఁడికొనుచునే తనయస్త్రము నుపసంహరించివైచెను. క్రో ధోద్ధతుండగు నశ్వత్థామమాత్రము తనయస్త్రము నుపసంహ రించుకొనఁజాలక మునిద్వయముంగాంచి లజ్జితుఁడై" మహాత్ము లారా! భీమసేనభయంబున విపన్నుండనై యాత్మరక్షణంబు కొఱ కాశపడి క్రోధోన్మత్తతచేధర్మాధర్మపరిగణనంబుఁజేయుఁ జాలక దుష్కర్ముండనై పాండవవంశవినాశనంబు సంకల్పించి నేనీయస్త్రంబుఁ బ్రయోగించితిని. సంకల్పసిద్ధియగువఱకు నిది మరలునదికాదు. నేనేమిచేయుదును?" అనియెను.

వేదవ్యాసుం డప్పుడు "వత్సా! మహాత్ముండగు నర్జునుండు రోషావేశుం డయ్యును,నీవినాశనమును గోరి తనయస్త్రమును బ్రయోగింపలేదు. నీమిత్రుండగు నర్జునుండు పుత్త్రహంతకుండవైనను నీకపకారంబు సేయం దలంపలేదు. కావునఁ బాండవరాజ్యసంరక్షణంబుఁ గావించుట నీకవశ్యకర్తవ్యంబై యున్నది. కావున, నీవిప్పుడు నీయస్త్రము నుపసంహరింపుము. క్రోధమును విడువుము. పాండవులకు భద్రమగుంగాక! నీశిరోరత్నమును భీమసేనున కర్పింపుము. ధర్మాత్ముండగు యుధిష్ఠిరుండు నీకభయదానంబు సేయఁగలఁడు." అని యుపదేశించెను.

అశ్వత్థామ వ్యాసదేవునియుపదేశమును మన్నించి,అతికష్టముచేఁ దనశిరోమణిని వృకోదరున కర్పించుట కంగీకరించెను. కాని, పగదీర్చుకొనుటకై ప్రయోగించిన దివ్యాస్త్రమును మరలించుటకు సమర్థుఁడు కాఁజాలకపోయెను. అప్పుడు మహామతియగు వాసుదేవుం డాతనియుద్దేశమును గ్రహించి "ద్రోణనందనా! నాచేఁబరిరక్షింపఁబడుచున్నయిప్పాండవుల నేవ్వరను నీయస్త్రమేమియుఁ జేయఁజాలదు. పాండవసంతానము నీవిదివఱకే విధ్వంసంబుగాఁజేసితివి. నీవింకనునపాండవం బెట్లుసేయఁగలవు" అనియెను.

అశ్వ—శ్రీకృష్ణా! భగవత్స్వరూపుండవగు నీవెట్లుచేసిన నట్లే యగును. కాని, బ్రహ్మవంశతిలకుండను భారద్వాజపౌత్త్రుండనునగు నామాటమాత్రము వమ్ముకానేరదు.నాదివ్యా

స్త్రము నాసంకల్పము ననుసరించి,ఉత్తరాగర్భస్థంబగుశిశువును హరింపక మానదు.

శ్రీకృ—బ్రహ్మణాశీర్వాదముచే నుత్తర భరతవంశోద్ధారకుం డగుపుత్త్రుం బ్రసవింపక తప్పదు. బ్రహ్మఖండవగు నీచేఁ బ్రయోగింపఁబడిన యయ్యస్త్రము తనకార్యమును సాధించుకొనుఁగాక. నేనామృతశిశువును దైవబలముచేఁ బునర్జీవితునింగావించి పాండువంశము నుద్ధరించెదను.

అనుటయు నశ్వత్థామ సిగ్గుచేఁ దలవంచుకొని తనశిరోమణినిదీసి పాండవుల కర్పించి పరాభవక్లేశముచే హృదయము దహించుకొనిపోవుచుండ నుత్తరాభిముఖుండై మహారణ్యపథంబువట్టి పోవుచు నాకస్మికక్రోధముచేఁ దా నొనరించిన యకార్యములంగూర్చి పరితపించుచుఁ బశ్చాత్తప్తచిత్తుండై యాదిమొదలుగ క్షత్రధర్మంబుఁబరిత్యజించి తామసంబువిడిచి సత్త్వగుణంబు నాశ్రయించి సత్కర్మంబులచేఁ బరిశుద్ధహృదయుండై క్రమంబుగ బ్రహ్మతేజస్సంపన్నుఁడై చిరంజీవి యయ్యెను.

మహాపురుషులగు వారు కాలకారణవశంబునంగలిగిన మనశ్చాంచల్యముచే నొడలెఱుంగక యాకస్మికముగ నేదేనొక యకార్యకరణంబుఁ గావించినను మరల స్వబుద్ధిచేతనే యాత్మదోషమును గ్రహించి పశ్చాత్తప్తులై యిట్లే పరిశుద్ధహృదయులై యావజ్జీవమును బవిత్రచరిత్రులై ప్రశంసనీయు లగుదురు.

# చిరంజీవులు.

## ౨ బలిచక్రవర్తి.



శర్వు మెప్పించి వరవిశే ♦ షములఁగాంచి
త్రిజగముల గెల్చి విపులకీ ♦ ర్తినిగడించి
ధర దివి శిరంబు శౌరికి ♦ దానమొసఁగి
నట్టిబలిచక్రవర్తికి ♦ డగుదు రెవరు?

శ్రీమన్నారాయణుని చరణారవిందభక్తులలో నగ్రగణ్యుఁడగు ప్రహ్లాదు నెఱుఁగనివారు లేరు. ఆమహాత్మునికుమారుఁడు విరోచనుఁడు. ఆతని కుమారుఁడగుబలి చక్రవర్తియై త్రిజగంబులఁ బ్రసిద్ధింగాంచి మించెను. ఆతనియున్నతింగాంచి దేవతలు చింతించి యందఱు నేకీభవించి యెట్లయిననాతనిజయింపవలయునని మంత్రాలోచనంబు సేయనారంభించిరి.

ఆతని రాజ్యపాలనంబున ముల్లోకంబులును నిష్కంటకంబులై యుండెను. ఆతనిరాజ్యమునం దీతిబాధలుగాని, అధర్మముగాని, దుర్భిక్షముగాని, ఆర్తనాదములుగాని, ఉపద్రవములుగాని, వ్యాధులుగాని, శత్రుభయములుగాని యెవ్వరికినిగలలో

నైసఁగానరాకుండెను. ఆతనియున్నతిచే దేవతలహృదయము లును, ఆతని ఖడ్గధారచే వారిసకలాంగకములును, ఆతనిశాస నముచే వారిసకలగౌరవములును జెదరిపోయెను. ఆరాక్షసరా జేంద్రునికీర్తిచంద్రిక లగ్నిజ్వాలలవలెసకలదేవతాహృదయము లను దహించివేయుచుండెను.

దేవత లందఱును బలిభయంబుచే విహ్వాలులై మాత్స ర్యవశంబున బృహస్పతియుపదేశంబువడసి వైకుంఠంబునకుం బోయి విష్ణుదేవుని సన్నిధిచేసికొని ప్రణామపూర్వకంబుగా దీనస్వరముతో "దేవదేవా! శంఖచక్రగదాధరా! దుర్బ లుల మగుటచే నార్తులమైయున్నమమ్ము రక్షింపుము. జనా ర్దనా! నీవు మారక్షణంబుకొఱకే యాయుధములను ధరించి తివి. నీవంటిరక్షకునిప్రాపుఁగాంచి యుండియు మేనిట్టికష్ట ముల ననుభవింపవలసియున్నది. దేవా! నిన్నుఁ గీర్తించుటకై వినియోగింపఁదగినమావాక్కుల నిపుడు ఆదైత్యుని సంస్తుతిం చుటకై యెట్లుపయోగింపఁగలుగుదుము? మేమందఱమును నీవే దిక్కుగా జీవించియున్నారము. నీపాదపద్మముల నాశ్ర యించియున్నమే మాదనుజున కెట్లు నమస్కరింపఁగలము? అనేక యజ్ఞంబులయందు మేము నిన్నే యర్చించుచు నుదార వచనంబులతో నిన్నే కీర్తించుచుందుము. నీవంటిదేవదేవుని కాశ్రితులమగు మేమాతని నెట్లాశ్రయింతుము? ఇంద్రప్రముఖు లగు దేవతలందఱును నీబలమే యాధారముగా నీ మూలమున

నున్నతపదమ్ముం గాంచియున్నారు. అట్టివారుహీనుండగు నొక్క దైత్యునకు లోఁబడియుండుట యవమానకరముగాదా? దేవా! ఈజగంబునం దైశ్వర్యమే ప్రధానమైనది. అది లేకున్న చో లాభమేమున్నది? నిర్భాగ్యులమగు మే మిప్పుడాతని నెట్లనుకరింపఁగలము? ఆదిమధ్యాంతరహితుఁడవును, చరాచరగురుండవు నగునీవుండఁగా వినశ్వరుండును శత్రుండు నగుదైత్యుని మేమెట్లుకొలిచియుండఁ గలము? మేమందఱమును నీయనుగ్రహముచే నెప్పటికైన విజయులమై సుఖింతుముగాని యాదైత్యునకు వినతులమై యుండఁజాలము." అని యనేకవిధంబులఁ బ్రార్థించిరి.

గదాధరుండగు నారాయణుండును దేవతలయెడలఁ గరుణాళుండై "సురవరులారా! దైత్యేశ్వరుండగుబలి నాప్రియభక్తుఁడగు ప్రహ్లాదునకుఁ బౌత్రుఁడు; విశేషించి భగవద్భక్తులలో నగ్రగణ్యుఁడు. కావుననే యాతఁడు సురాసురగణంబుల కవధ్యుఁడై యున్నాఁడు. మీసంరక్షణభారమును వహింపవలసినట్లే యాతనిపరిపాలనాభారమునుగూడ నేను భరింపవలసియున్నది. నేనాతని నెదిరించి యుద్ధము చేయఁజాలను. సమయముంజూచి సదుపాయము నాలోచించి యెట్లయిన నాతని రాజ్యముంగైకొని మీకొసంగెదను. అంతవఱకును మీరు నిశ్చింతులై యుండుఁడు" అని యనుగ్రహించుటయు దేవతలు పరమానందహృదయములతో నమ్మహాదేవునికడ సెలవుగైకొని నిజనివాసంబులకుఁ బోయిరి.

ఇటు బలిచక్రవర్తియుఁ జతుర్దశభువనములయందును దన్నెదిరించువా రెవ్వరును లేక యుండ ముల్లోకముల నేలుచు సార్వభౌముఁడై ప్రసిద్ధిఁగాంచి తనకీర్తిచంద్రికలు దశదిశలయందును వ్యాపించి వర్ధిల్లుచుండ ననేక క్రతుసహస్రంబులు గావించి నిరంతరమును విప్రసహస్రంబులకుఁ బసిఁడిపళ్లెరంబులం దన్నదానంబుఁ గావించుచు భూరిదక్షిణలతో ననేకగోదానంబులు సేయుచు ధర్మకార్యతత్పరుండై ధర్మశాసనంబునఁ బ్రజాపాలనంబు సేయుచుండెను.

మహాదాతయును,మహాతేజుండును,మహాప్రభుండును,మహామతియు నగు నాబలిచక్రవర్తి యీవిధముగా సత్కాలక్షేపము సేయుచు నొకప్పు డశ్వమేధయాగదీక్షితుండై విధివిధానంబున యజ్ఞకార్యంబులు నిర్వర్తించుచుండెను. ఇట్లాతఁ డనేక భూసురపరివృతుండై తన్మధ్యంబున మహావిష్ణువుంబోలి తేజరిల్లుచున్నసమయంబున నాకస్మికముగ నొక బ్రాహ్మణవటువాసభామధ్యమునఁ బ్రవేశించెను. ఈతఁడు పరమేశ్వరుఁడో, పురుషోత్తముఁడో, భారతీనాథుఁడో యగుంగాని కేవల మానవమాత్రుఁడు కాఁడని సభ్యులందఱు నాతనింగాంచి తమలోఁ దాము గుజగుజలు వోవుచుండిరి. ఆవటుని తేజ మిట్టిదని వర్ణింప నలవిగానిదై చూపఱ కాశ్చర్యముం గొల్పుటయు సభవారందఱు చేతులుసాఁచి దయసేయుండని యాతనికిఁ బ్రత్యుత్థానముఁ గావింప నారంభించిరి.

కాని, యావటువుమాత్ర మొక్కఁడను గూరుచుండక కొండఱితోఁ దర్కవితర్కములును, గొందఱితో శబ్దచర్చయుఁ, గొందఱితో శాస్త్రచర్చయుఁ గావించుచు నపరిమితంబును మనోహరంబు నగు తనవాగ్ధోరణినుండి యమృతవర్షమును గురియించుచుఁ గ్రమముగా నాపరిషత్తునంతను నాకర్షించివైచెను. ఏశాస్త్రము నెఱుఁగని మూఢులుకూడ నాతనిమాటలయందలి తేటతేనియలం గ్రోలుచు నన్యంబెఱుంగక సుందరుండగు నక్కుమారుని ముద్దుమొగమువంకనే చూచుచుఁ దన్మయులై యుండిరి. ఈవిధముగా నవరూపములు ధరియించిన వేదరాశియుంబోలె నావటువు దండమును, గొడుగును, బట్టుకొని కక్షతలంబున భిక్షాపాత్రము వ్రేలాడుచుండ నింద్రనీలంపుఁగోవలవలె నున్న కురుచజడలు, కన్నులకింపులింపుచుండ సభ్యులను దప్పించుకొనుచు నెఱింగినవాఁడునుంబోలె నందఱిని సేమమడుగుచు నడుమ నడుమఁ గోమలమధురకంఠస్వరముతో సామగానము సేయుచు యజ్ఞదీక్షితుండగు బలిచక్రవర్తినిసమీపించి కుశపవిత్రాక్షితంబగు దక్షిణహస్తంబు సాఁచి "ఇతఁడే నాదానవలోకచక్రవర్తి?" అని ప్రశంసించి గంభీరస్వరముతో "నిఖిలబృందారకగర్వాపనయప్రవర్తికి, వివిధదానాభరణాసుర ర్తికి, బలిచక్రవర్తికి! స్వస్తి, స్వస్తి" యనియాశీర్వదించెను.

అప్పుడు బలిచక్రవర్తి ప్రహృష్టమానసుండై లేచి యక్కుమారునకు సాష్టాంగనమస్కారంబు చేసి యాతని నుచి

తాసనంబున నాసీనుంగావించి సహధర్మిణియగు వింధ్యావళ్ళీ దేవి సమయ మెఱింగి కనకకలశంబులఁ గొనితెచ్చినపాద్యజలంబులచేనాతనిపాదకమలములు బంగారుపళ్లెరమునునుంచియభిషేచనంబుఁ గావించి యాంపవిత్రోదకమునుబత్నీసహితంబుగ శిరంబునఁ జల్లుకొని వినయమధురస్వరముతో "వటుగా! నీవెవ్వరివాఁడవు? నీనివాసం బెచ్చట? నీవిచ్చటికి విచ్చేయుటచే నేనుతరించితిని. నావంశమంతయునుదరించినది. నాయజ్ఞము సఫలంబైనది. అగ్నిహోత్రంబులు సంపన్నంబు లైనవి. నీదర్శనలాభముచే నీసమయము కల్యాణకరంబైనది. నీయాగమనకారణంబు వచియించి నన్ననుగ్రహింపుము. నీకలంకారములు కావలయునేని యమూల్యమణిఖచితంబులగుసువర్ణభూషణంబులచేనిన్నలంకరించెదను. పరిణయముం గోరుదువేని త్రిలోకసుందరీమణులగు కన్యారత్నములనిచ్చి నీకుఁగల్యాణంబుఁగావించెదను. ప్రభుత్వమునభిలషించినచో సర్వసంపత్సమృద్ధంబులగు గ్రామముల నీకర్పించెదను. సార్వభౌమత్వము నభ్యర్థించెదవేని యీత్రైలోక్యసింహాసనంబున నిన్నుఁబ్రతిష్ఠించి నీకభిషేకంబు గావించెదను. వటుశిరోమణీ!నీకేమికావలయునోకోరుము.ఈక్షణంబ నీయభీష్టంబుఁ దీర్చి చరితార్థుండ నయ్యెదను." అనివిన్నవించెను.

అంతవామనుండు తనముద్దుమోమునకు లేఁతనవ్వువన్నెలుదిద్దుచుండ మృదుమధురగంభీరస్వరముతో "ఓదానవసార్వ

భామా! నిలుచుటకు నాకొకనివాస మనునదిలేదు. నే నెల్ల యెడల నివసించుచుందును. నేనెవ్వరివాఁడనని చెప్పుదును? నావారందఱిలోనను నేను నాయంతవాఁడనై తిరుగుచుందును. ఎల్లవృత్తుల నవలంబించియున్ననాకు నిదివృత్తియని చెప్పుటకవ కాశమేమున్నది? అన్నియు నేర్చియున్ననేను ప్రత్యేకముగనేది నేర్తునని చెప్పుదును? మహారాజా! నాకెవ్వరునులేరు. నేనందఱి వాఁడనై యున్నాను. ఒంటివాఁడను. నాకొక్కచోట్టమైనను లేఁడు. పూర్వము నేను శ్రీమంతుఁడనే. నేను తఱచుగా సాధు సంఘమున సంచరించుచుందును. నామాట యటుండనిమ్ము. నీవిప్పుడుచెప్పినమాట కీర్తికరంబును గులోచితంబును ధర్మ యుతంబునై యున్నది.

కరుణార్ద్రహృదయులును పరాక్రమసంపన్నులును గాని వారు మీకులంబున జనియింపరు. రణభీరువులును వితరణభీరు వులును మీవారిలో లేరు. శత్రువులను మహారణంబులను యాచకులను మహావితరణంబులను దనుపుచుఁ బ్రశంసనీయు లైన మీతాతలందఱును మేటిమగలు. ఆకాశమును జంద్రుని వలె మీకులమునంతను వెలయించిన ప్రహ్లాదుఁడు మీపితామ హుఁడు. మీవంశము రత్నాకరమువలె భాగ్యగౌరవములచేఁ బ్రశంసనీయమైనది. మీమూఁడవతాత యగుహిరణ్యాక్షునిప రాక్రమమునకు భయపడి విష్ణుండు పలాయితుఁడై యజ్ఞవరా హరూపమును ధరించి పాతాళలోకంబున వసియించెను. నీతం

డ్రియగువిరోచనుఁ డొకప్పుడు బ్రాహ్మణవేషముతో వచ్చి తన్ను యాచించినదేవేంద్రునకుఁ దనయాయువునే సమర్పించెను. అట్టిదానవీరులగు దానవశేఖరులవంశమునందు ప్రభవించిననీవుమాత్రము సామాన్యుఁడవా? నీఘనతననుసరించి నీవింత యుదారబుద్ధితో నేదేనొక మహావరమును గోరుకొమ్మని వచించితివి. కాని, నీమణులును, మాన్యములును, గ్రామములును, సామ్రాజ్యమును నాకేంటికు? జగంబులెల్ల నీదానయశోగీతి కలఁ బాడుచుండ వినుచుండియు నేను నిన్నెన్నఁడును యాచింప రాలేదు. ఏకాకి నగునాకు నొకటిరెండడుగులనేల యిచ్చితివేని చాలును. అదియే నాకు బ్రహ్మాండము." అనివచించెను.

అప్పుడు బలిచక్రవర్తి పరమయాచకుండగు విప్రకుమారుంగాంచి "ఓచిన్నివడుగా! నీమాటలన్నియు యుక్తియుక్తములును, సత్యములును, సాధుసమ్మతములు నైయున్నవి. కాని, నీవడుగఁదలంచియును గొంచెపుగోరికంగోరితివి; పసిబాలుఁడవు. అడుగుట చేతఁగానివాఁడవు. దాతపెంపైనను దలంపవలదా? ధనకనకవస్తువాహనాదులును, కన్యకామణులును, గ్రామములును, రాజ్యములును నుండఁగా నీవు గోరిన దిదియా? నీయదృష్ట మింతటిదే యైనఁ గావచ్చునుగాని, దానవసార్వభౌముఁడ నగు నాకీయల్పదానము గావించుట చిన్నతనముగాదా?" అనియెను.

ఆమాటలకు వామనుండు మందహాసంబుఁ జేయుచు "వదాన్యశేఖరా! గొడుగును, జన్నిదమును, కమండలువును, మౌంజియు, దండమును దాల్చి నిత్యోచితకర్మంబులఁ గావించుకొనుచుండు వటువునగు నేనెక్కడ? భూములును, గజాశ్వాదులును, మణులును, కన్యకామణులును, రాజ్యములును నెక్కడ? నేనడిగినమూఁడడుగులనేలయు లేదనకుండ నిచ్చుటయే నాకుఁజాలును. సంతుష్టిలేనియాచకుఁడు సంతాపభాజనుఁ డగును. సంప్రాప్తంబైనతృణమే మహామేరువుగా భావించి సంతోషించువానికి సుఖసామ్రాజ్యము కరతలామలకం బగును. ఆశాపాశమున కంతమెక్కడనున్నది? సముద్రవలయితంబగు సామ్రాజ్యముచేకూరినను వైన్యగయాదిమహారాజులర్థలోభమును విడువఁజాలకపోయిరి. నీవు మహారాజువని సర్వస్వమును నిన్నడుగుట యుచితముకాదు. నాకుఁదగినట్లు నేనీమూఁడడుగులనేలను వేఁడికొంటిని" అనియెను.

బలిచక్రవర్తి కట్టియల్పదానమును జేయుట కసంతుష్టిగానున్నను, పాత్రగౌరవమునుబట్టి యాతని కాభూదానంబుసేయ నిశ్చయించి జలకలశంబు నందికొనుటయు దానకుతుకసాంద్రుండగు నాదానవేంద్రుంగాంచి దనుజకులగురుండుభృగువరుం డిట్లనియెను.

"దనుజేంద్రా! ఈతఁడు కేవల విప్రకుమారుఁడుకాఁడు. దేవకార్యమును సాధించుటకై విష్ణుదేవుఁ డీవిధముగా నదితిగ

ర్భమునఁ గశ్యపపుత్త్రుఁడై జన్మించినాఁడు. ఈవిషయము నెఱుం
గక నీవితనికిఁ గోర్కెఁ దీర్ప నిశ్చయించితివి. ఇందువలన దైత్యకు
లంబున కంతకు నుపద్రవంబు రాఁగలదు. ఈతఁడు నిన్ను వం
చించి నీయైశ్వర్యమును, దేజమును, రాజ్యమునుగూడ వాసవున
కుఁ బ్రసాదింపఁదలంచి యున్నాఁడు. ఈతఁడు నిన్నడిగినమూఁ
డడుగులదానముచేతను ముల్లోకముల నాక్రమింపఁగలఁడు.
సర్వస్వమును విష్ణుదేవున కర్పించి దీనుఁడవై నీవెట్లు బ్రదుకఁగ
లవు? ఇచ్చెదనని వాగ్దానముచేసి యీయకుండువానికి నరక
ప్రాప్తియగుననుట సత్యమే. కాని, యేదానముచే సర్వనాశన
ముకలుగునో యది దానముకాదని పెద్దలు వక్కాణించియు
న్నారు. ధనవంతుఁడగువాఁడు తనసర్వస్వము నైదుభాగములు
గాఁజేసి ధర్మార్థకామములకును, గీర్తికిని, నాశ్రితులకును, సమ
ముగా వెచ్చింపవలయును. అట్టివారికే యిహపరసుఖంబులు
గలవు. తనకుమాలినధర్మము తగదు. కేవలసత్యముకొఱకు
భ్రమపడి సర్వస్వమును దానముచేసినచో నీకేమిలాభమున్న
ది? నిన్ను నీవు రక్షించుకొని పిదప నీవునీధర్మమును నిలుపుకొ
నవలయును. స్త్రీలవిషయమునను, వివాహవిషయమునను,
ప్రాణాపాయసమయమునను, ధనమానహానియందును, భీతవి
ప్రసంరక్షణమునందును, గోరక్షణమునందును నసత్యమాడి
నను బాపమువాటిల్లనేరదు. ఈదానమువలననీకేకాక నీకులము
నకంతకు నపాయము రానైయున్నది. కావున నీవిప్పట్టుననసత్య
మాడినను దోషములేదు."

అని యిట్లు హితోపదేశంబు సేయుచున్న కులాచార్యుం గాంచి యించుకసేపు నిమీలితలోచనుండై యోచించి "మహాత్మా! అనృతమాడినచో నొకవిషయమున దోషముండుననుటయు, వేఱొకవిషయమున దోషములేదనుటయు, నాకంతసమంజసముగా నగపడుటలేదు. నేను తొలుదొల్త నీవడుగునకు నర్థము, కామము, యశము, వృత్తి, యనువానిలో నేదికోరినన దియిచ్చెదనని మాటయిచ్చితిని. అర్థలోభముచే నిప్పు డీతనిం బొమ్మని లోకులయపవాదమునకుఁ బాత్రుఁడనగుటకంటె నింకఁ బాపమేమున్నది? భూదేవి యెంతటిపాపాత్ముడైనను మోయఁజాలుదానుగాని యసత్యవాదినిమాత్రము భరింపఁజాలనని చెప్పియున్నది. యుద్ధమున వెనుదిరుగక చచ్చుటకంటెను, పలికి బొంకక బ్రతుకుటకంటెను, మించిన సౌభాగ్యము మానవుల కింకనేమున్నది? రాజులు లేరా? ఐశ్వర్యములు లేవా? అందొకచిల్లిగవ్వయైన మూటఁగట్టుకొని పోయినవారెవ్వరైన నున్నారా? ఈలోకంబున వారిపేరైన నున్నదా? కాని, కీర్తికాములై యర్థులు కోరినకోరికల నొసంగి ధన్యులైన శిబిప్రముఖుల నెన్నటికైన మఱవఁగలమా! ఆచార్యవర్యా! మీరన్నట్లీవడుగు నారాయణుఁడే యగుఁగాక! ఎన్నియో యజ్ఞములు గావించినను వ్రతముల నాచరించినను, అందని సర్వేశ్వరుఁ డీపొట్టివడుగు రూపమునవచ్చి నన్ను యాచించినప్పు డీతని యభీష్టమును దీర్చుటకంటె నాకుఁ గావలసినదేమున్నది?

సకలప్రాణిలోకమునకును నిత్యజీవనప్రదానముం గావించు చుండు శ్రీనాథుని కరకమలంబు క్రిందగుటయు నా చేయిమీఁ దగుటయు మేలుగాదా? ఈరాజ్యమును గీజ్యమును శాశ్వత మా? ఈజీవితము సుస్థిరమా? నరకమైనను, నిర్బంధమైనను, నాశనమైనను, దుర్మరణమైనను, కులాంతమైనను సరియే; నేను సత్యముఁ దప్పఁజాలను. ఈయతిథి హరుఁడైనను, హరియైనను, అబ్జాసనుఁడైన నగుఁగాక! నామాట తిరుగనేరదు. మేరువు తలక్రిందులైనను, సముద్రము లింకిపోయినను, ధరాతలము నుగ్గైపోయినను, గ్రహగతులు తప్పిపోయిననుపోవుఁగాక! నేనీ దానము నొసంగక తప్పువాఁడనుగాను. ఎన్నఁడు నితరుల వేఁ డనివాఁడను, నేకాత్ముఁడను, సర్వవిద్యలకు మూలకారణుఁడు ను నగు నీపొట్టివడుగు చేతులొగ్గి యాచించుచుండ లేదని చె ప్పుటకు నానోరెట్లాడును?" అని వచించెను.

ఇట్లు దృఢనిశ్చయుండై దానాచరణమునకుఁ ద్వరపడు చున్న సత్యసంధుండును, కీర్తికాముండును, నైన బలింజూచి దనుజకులపురోహితుండగు శుక్రుండు కోపించి "నాయుపదే శంబును దిరస్కరించిన స్వేచ్ఛాచారుండవగు నీవచిరకాలంబు ననే పదభ్రష్టుండ వయ్యెదవుగాక!" అని శాపంబిచ్చెను. కుల గురునిచే నట్లు శపింపఁబడియు, నిశ్చలచిత్తుండగు బలిచక్ర వర్తి యనృతమార్గంబున కభిముఖుండు గాకుండెను. ఎట్టినిర్బం ధములు దటస్థించినను, ఎంత లేమివచ్చినను, ఎట్టిప్రాణసంక

టములు సంఘటిల్లినను మానధనులెన్నఁటికిని మాటఁ దిరుగఁ జాలరుగదా!

ఆసమయంబున నాథుండగు దనుజేశ్వరుని కనుసన్న నెఱింగి సహధర్మిణియగు వింధ్యావళీదేవి జలకలశంబు గొని తెచ్చెను. వదాన్యశిరోమణియగు బలిచక్రవర్తి యుప్పొంగి వటువటుని దక్షిణపాదమును బంగరుపళ్ళెమునందుంచి భక్తిపూర్వకంబుగా వింధ్యావళీదేవి జలంబులు వోయ, నిర్మలచిత్తముతో సకల లోకసముద్ధరణంబును, భవసంహరణంబును, నగు నాశ్రీహరిచరణంబు నభిషేకించి యాజలంబుల శిరంబునఁ జల్లికొని యాతనిదక్షిణహస్తమున దానజలధారను విడువఁబోవఁ గలశరంధ్రమునుండి జలంబు వెలువడ దయ్యెను. అప్పుడు విశ్వాత్ముండగు వామనమూర్తి కలశరంధ్రమునకు శుక్రుం డడ్డుపడియెనని గ్రహించి యటఁ గుశాగ్రంబునఁ బొడుచుట యుఁ గన్నులొట్టవోయి శుక్రుఁడచ్చటినుండి తొలఁగిపోయెను. తోడనే బలిచక్రవర్తి "విష్ణుస్వరూపుఁడవును, విప్రుఁడవును, వేదవేద్యుఁడవును నగునీకు మూఁడడుగుల నేలను దానముచేయుచున్నాఁడను." అనిచెప్పుచు దానజలధార నావామనుని దక్షిణహస్తమున విడిచిపెట్టెను. అరివిష్ణుండని యెఱింగియు నాత్మవినాశంబును నెఱింగియుఁ గులగురుని యుపదేశము సత్యమని యెఱింగియు, సత్పాత్రము లభించెనుగదా యనుసంతోషముతో సర్వస్వమును దానముచేసిన బలివంటి వదాన్యులీలోకములో నెవ్వరున్నారు?

వామనుండిట్లు భూదానమును బరిగ్రహించి "రాజేంద్రా! నీవిహపరలోకంబులయందుఁ గీర్తిసుకృతంబులుబడయఁ గలవు. నేనింతటిచిన్నకోరికం గోరితినని విచారింపకుము. నాకిది యిచ్చుట ముల్లోకములు నిచ్చుటయే" అనివచించుటయు నాచిట్టివడుగు ముద్దుపలుకులకుఁ బలిచక్రవర్తి పరమానందభరితుం డయ్యెను. దానవీరుండగు బలియొసంగిన భూదానంబునకు సర్వభూతనాథుండగు పరమేశ్వరుండు సంతుష్టుండగుటచే నట్టిదానముంగూర్చి దశదిశలును బంచభూతములునుఁగూడఁ బ్రశంసించెను. సకలగ్రహతారకంబులును, మునీంద్రులును,సిద్ధగంధర్వకిన్నరాదులును, దేవతలును గూడ దానవీరుండగు బలిసార్వభౌము ననేకవిధములఁ గీర్తించిరి. సకలలోకానందసూచకముగాఁ బుష్పవర్షములు గురిసెను. దేవదుందుభులు మొరసెను.

అప్పుడు వామనమూర్తి చూచుచుండఁగనే క్రమక్రమముగ నెదిగి మేఘమండలమునంటి, చంద్రమండలమునుదాఁటి, ధ్రువస్థానము నతిక్రమించి,సత్యపథము నధిగమించి, సకలలోకంబులును గడచి, బ్రహ్మాండమంతయు నాక్రమించి యెల్లయెడలఁ దానయై విశ్వరూపంబుఁ దాల్చి శతకోటివిద్యుల్లతాతేజంబునుమించి విరాజిల్లుచుండెను.ఆవిశ్వరూపదివ్యతేజము కంటికినిమింటికినినందకుండ వ్యాపించియుండుటయు మిఱుమిట్లుగొనుచున్నకన్నులతో నాదివ్యతేజమునుగాంచనేరక బలిసార్వ

భూమండలమును నభోమండలమునుగూడ నా దేవదేవు ననేకవిధంబులఁ బ్రస్తుతింప నారంభించిరి. ఆవిశ్వమూర్తి, ఒక్కపాదంబుచే భూమండలమును, వేఱొక పాదముచే గగనమండలమునుగూడ నాక్రమించి బ్రహ్మాండమునిండి వాక్కులకును దృష్టులకును గూడ నందరాక సర్వమయుండై వెలుంగుచు మరలఁ గ్రమక్రమంబుగ వామనాకారంబు వహించి నిలువంబడి యెను.

అప్పు డక్కపటవటుకుమారుని మోసమును గ్రహించి రాక్షసులందఱును రోషావేశముచే నాతని నాక్రమింపఁ విజృంభించిరి. అది యంతయుంగాంచి బలీంద్రుండు శుక్ర శాపంబుఁ దలంచుకొని శాంతంబువహించి తమవారిని వారించుచు "ఓరాక్షసవరులారా! ఇది పోరాటమునకు సమయము కాదు.

సర్వజీవసంపదలకును, ఆపదలకును, . కారణస్వరూపుఁ డైన పరమేశ్వరుని మనము పరిభవింపఁజాలుదుమా? మనకు విజయమును దేవతల కపజయంబును గటాక్షించిన యావిశ్వనాథుఁడే యిట్లు విపరీతముచేయుట మన దురదృష్టముగాక వేఱేమున్నది? మిమ్ముఁ గనుఁగొన్నంతనే భయపడి యెన్నియో సారులు పలాయితులైన విష్ణుభటు లిప్పుడు మిమ్మెదిరించి నిలుచుట దైవలోపముకాదా? మనకు మంచిదినములువచ్చిన ప్పుడు క్రిమ్మఱ మనము మనశత్రువులను జయింతముగాక!

ఇప్పటికి శాంతివహింపుఁడు" అని ప్రబోధించుటయు నిరుత్సా
హులై రక్కసులు రసాతలంబునకుఁ బోయిరి.

ఆసమయంబున దేవదేవుని హృదయం బెఱింగి గరుఁ
డుండు దనుజవల్లభుని వారుణపాశంబులచే బంధించెను. బలి
చక్రవర్తి యట్లు బంధితుండయ్యును నదియంతయు నీశ్వరాను
గ్రహమే యని భావించుచు నిశ్చలచిత్తముతో నిలుచుటయు
దశదిశల, దిగంతములయం దాహాకారంబులు బయలువెడ
లెను. దైన్యమును గంపమును లేక మునుపటికంటెను ధైర్యము
నుసాహసమును మెఱయుచుండ జ్ఞానతేజంబున వెలయుచున్న
వదాన్యమూర్తియగు బలిచక్రవర్తిం గాంచి వామనమూర్తి
"ఓయీ! నీవు నాకు మూఁడడుగులభూమి దానముచేసితివి.
ఈభూమండలమును గగనమండలమునుగూడ నాకు రెండడుగు
లయ్యెను. మూఁడవయడుగున కిఁక నెచ్చటనైనఁ దావున్నదా?
ఇయ్యఁగలవా? దానముచేసి యియ్యకున్నచో మహాపాపము
సంఘటిల్లును. పాపంబుఁ దప్పించుకొనఁదలఁచినచో శీఘ్ర
ముగ నాకు మూఁడవపదమునకుఁ దావుచూపుము" అనివా
మనుండు నిరోధించుటయు సత్యభంగశంక హృదయమును గ
లంచుచున్నను బలీంద్రుండు ధైర్యంబువిడనాడక నిర్భీకుండై
ప్రసన్నవదనముతో "వటుశిఖామణీ! నాజిహ్వా కసత్యలేశస్పర్శ
మైనను లేదు. ఎట్టికష్టసమయమునందైనను నేను బొంకనొల్లను.
నేనసత్యమునకు వెఱచినట్లు నరకమునకైనను నిగ్రహంబున

కైనను పదభంగమునకైనను నిర్బంధమునకైనను సర్వనాశనమునకైనను మఱియెట్టిదుఃఖమునకైనను వెఱచువాఁడనుగాను. నీమూఁడవపదము నాశిరంబున నుంచుము. దేవా! నీకీయరాని దేమున్నది? మృత్యువు చెలిమికత్తెయగునా? యముఁడు చుట్టమగునా? యమకింకరులు పరిచారకు లగుదురా? జీవితముసుస్థిర మగునా? మూఢు లీసంసారమును నిత్యముగా భావించి సత్యదానధర్మవిముఖులై దుర్గతులపాలగుచుందురు. మహాత్మా! మాతాతయగు ప్రహ్లాదుఁ డొక్కఁడుమాత్రమే నీపాదకమలంబుల నాశ్రయింపఁగలిగెను. కావుననే యాతనికి మృతిలేని బ్రదుకు గలిగెను. కాని, తక్కినమావారందఱును వైరులైకాని నిన్ను దర్శింపఁజాలకపోయిరి. నీవిపుడు యాచకుఁడవై నాయొద్దకువచ్చి నన్నర్థించుట నాపుణ్యఫలముకాదా?" అని యానంద పారవశ్యమునఁ బలుకుచున్నసమయంబున నాకస్మికముగఁ బ్రహ్లాదుం డచ్చట సాక్షాత్కరించుట నసురవల్లభుండు వారుణపాశబద్ధుండు గావునఁ దాతకుఁజేతులెత్తిమ్రొక్కఁజాలక బాష్పాకులితలోచనుండై సిగ్గునఁదలవంచునెపంబున మ్రొక్కు చెల్లించుకొనియెను.

అప్పుడు ప్రహ్లాదుఁడు వామనమూర్తింగాంచి మేనెల్ల పులకింప నానందబాష్పంబులు వెల్లివిరియ సాష్టాంగదండ ప్రణామం బాచరించి "మహాదేవా! తొల్లి నీవీతని కిందప్రపదం బిచ్చి మరలఁ గైకొనుట మేలేయైనది. నీవీతనియజ్ఞానాంధకా

రమును మాన్పి కరుణతో రక్షించుటగాని యది బాధించుట
గాదు. జ్ఞానమూర్తులకు స్వర్గముతోఁ బనియేమున్నది? మ
హేంద్రత్వముతోఁ బనియేమున్నది? మీపాదసేవకు మించిన
భాగ్యము మఱి యెచ్చటనున్నది?” అని విన్నవించుచుండఁగాఁ
గన్నులనుండి బాష్పకణంబులు లాణిముత్తియములవలె జాలు
వాఱుచుండ నిటలతటఘటితాంజలియై వింధ్యావళీదేవి మంద
గమనంబుతో వామనమూర్తిని సమీపించి “పతిభిక్షాం దేహి”
యని ప్రార్థించుచు దేవదేవునిచరణసన్నిధిని బ్రణామంబుఁగా
వించి నిలువఁబడి “దేవదేవా! నీకుఁ గ్రీడారంగములగు నీలో
కములంగాంచి దుర్మదాంధులగు రాజులు మేము లోకాధీశుల
మనుకొనుచుందురు. సర్వేశ్వరా! ఈలోకంబునందు నీకంటెఁ
బ్రభుఁ డెవ్వఁడున్నాఁడు? ప్రభూ! నానాథుఁడు సత్యసంధుఁడు.
రాజ్యమదంబునఁ గన్నుఁగాననివాఁడుగాఁడు. నిన్నుఁగాదన
లేదు. నీకిచ్చినది లేదనలేదు. నిశ్చలహృదయముతో నీజగత్త్రి
యంబును నీకర్పించియున్నాఁడు. ఇట్టినాస్వామిని నీప్రియభక్తుని
పౌత్త్రుని నిర్దయుండవై యీవిధముగా నేలబాధించెదవు? ఆశ్రి
తవత్సలా! రక్షింపుము! రక్షింపుము!!” అని ప్రార్థించెను.

అప్పుడు పరమేశ్వరుండగు వామనుండు ప్రసన్నుండై
“సతీమణీ! మానధనుండగు దానవేంద్రునిసహధర్మిణివగునీవు
ధన్యురాలవు. పుణ్యమయంబగుమీదాంపత్యము ప్రశంసనీ
యమైనది.” అని యనుగ్రహించి బలీంద్రు నవలోకించి “దా

నపేశ్వరా! నీనిశ్చలహృదయుంబునకును ననుపమానంబగు నీదానదీక్షకును సత్యనిష్ఠకును నేను సంప్రీతుండనైతిని. నీయభీష్ఠవరప్రదానంబు గావించెదను. కోరుకొమ్ము" అని యానతిచ్చెను.

కాని, సర్వజ్ఞుండును, శాంతుండును, సంతుష్టుండును, సాధుశీలుండు నగుబలిసార్వభౌండు నిరపేక్షుండై యూరకుండెను. అప్పుడు జగన్నాథుండును దివిక్రముండునగువిష్ణుదేవుండు సంతోషించి మహాదానశీలుండగు దనుజలోకపాలునకు రసాతలరాజ్యంబును నాత్మాధిపత్యంబును భావికాలంబున నింద్రపదంబును శాశ్వతంబగుమహాయశంబును జిరజీవనమును బ్రసాదించి సస్త్రీకుండగు బలిదానవేంద్రుని సపరివారముగా రసాతలరాజ్యసింహాసనమునం బ్రతిష్ఠించెను.



# చిరంజీవులు.



## 3 వేదవ్యాసుఁడు.



> వేదములను నాల్గు ♦ విధముల భాగించి
> పుణ్యోత్తమపురాణ ♦ ములు రచించి
> జగతియందు ధర్మ ♦ సంస్థాపనముఁ జేసి
> నట్టివ్యాసమౌని ♦ నభినుతింతు.

బ్రహ్మమానసపుత్త్రుండును, బుణ్యశ్లోకుండు నైన వసిష్ఠ మునీంద్రుఁడు త్రిలోకవిదితుఁడు. ఆతనికుమారుఁడు శక్తి. ఆశక్తికిఁ బరాశరుఁడు జన్మించెను. బ్రహ్మతేజస్సంపన్నుఁడగు నప్పరాశరుండు నియతవ్రతుండై తీర్థయాత్రలఁ గావించుచుండెను. ఆతనియనుగ్రహంబున జాలరికన్నెయగుమత్స్యగంధి గర్భమునుండి, దివ్యజ్ఞానసంపన్నుండును, దివ్యతేజోమయుండును, సకలవేదశాస్త్రపరిజ్ఞాతయు, నగువ్యాసమహర్షి యుదయించెను. వ్యాసమునీంద్రుండు పుట్టినప్పుడె సద్యోయౌవనుండై, జననింగాంచి నమస్కరించి "అమ్మా! నీవుతలంచినప్పుడు వచ్చి నీయాజ్ఞను నెఱవేర్చుచుండెదను. తపశ్చరణంబునకు

నాకనుజ్ఞ సేయవలయును." అని వేఁడికొని, తల్లిని వీడుకొని, తపంబునకు వెడలిపోయెను.

అతఁడు పుట్టుకతోడనే జ్ఞానవంతుండగుటచే శ్రీహరిచరణభక్తుండై మహాతపముగావించి విజ్ఞానంబు వడసి నిరంతరమును జగత్సంచారము సేయుచు, నజ్ఞానులును, నధోగతులునగు రాజులకును, ప్రజలకును, జ్ఞానోపదేశముగావించుచుఁదనజీవితమంతయు లోకోపకారమునకే వినియోగించి స్వజనస్తవనీయచరితుఁడయ్యెను.

శ్రీమన్నారాయణుని యేకవింశత్యవతారములలోపలను బదునేడవది వ్యాసావతార మని భాగవతమునందుఁ బ్రశంసింపఁబడియున్నది. అతఁడు చిన్నతనమునుండియుఁ బ్రజ్ఞానసంపన్నుఁడై లోకావనంబుకొఱకు సత్కార్యంబుల నాచరించుచుఁ గాలక్షేపము సేయుచుండెను. అతఁడొకప్పుడు సరస్వతీనదీతీరమునం దుపవసించి వేదములంగూర్చి యాలోచించుచు జ్ఞానస్వరూపమగు వేద మిట్లేకముఖంబుగా నుండుట సరిగాదనితలంచి భూతభవిష్యద్వర్తమానకాలంబులఁ బరిశీలించి భావికాలంబున క్షీణశక్తులును, నిస్తేజులును, ధైర్యశూన్యులును, మందప్రజ్ఞులును, నల్పాయువులును, దుర్బలులును జనింతురనియుఁ గాలవశమున జనులు క్రూరులును, నసత్యవాదులును నధర్మపరులునై యధోగతులగుదురనియు భావించి యట్టివారి నుద్ధరించుటకై శుద్ధికరంబులగు వైదికకర్మంబులును, యజ్ఞంబులును, నెడ తెగ

కుండ నాచరితంబులు గావలయు ననియు నిశ్చయించి, యేక ముఖంబగు వేదమును, చతుర్విధంబుల విభాగింపనెంచి, సరస్వతీజలంబులఁ గృతస్నానుండై నిత్యకర్మంబులం దీర్చి నియతుండై ఋగ్యజుస్సామాధ్వర్వణనామంబులచే వేదవిభాగంబుఁ గావించెను. అందు ఋగ్వేదము పైలునకును, యజుర్వేదము వైశంపాయనునకును, సామవేదము జైమినికిని, అధర్వణవేదము సుమంతునికిని నుపదేశించి, వారిచే నావేదములను లోకకల్యాణముకొఱకు సర్వదేశములయందును బ్రకాశింపఁజేసెను. అందుమూలముననే మునివరుండగు వ్యాసునకు వేదవ్యాసనామ మన్వర్థమైనది.

తరువాతఁ గ్రమక్రమముగ జగంబునందలి ప్రజలలో భిన్నాభిప్రాయములు గలిగి, సర్వప్రపంచమునకును గర్తయగువాఁడు శివుఁడేకాని, యితరులుకారని కొందఱును, విష్ణువే సర్వేశ్వరుఁడని మఱికొందఱును, సృష్టికర్తయగు బ్రహ్మయే విశ్వనాథుఁడని వేఱొకకొందఱును, జీవకోటియంతయు సృష్టింపఁబడుట కాధారము మహాశక్తియే యని యింకఁగొందఱును దర్కవితర్కములం జేయుచు, వివిధమార్గముల నవలంబించి విధివిధానముల నెఱుంగక పెడత్రోవలం బట్టి చెడుచుండుటచే, భూలోకమునం దనాచారవాహినులు పొంగిపొరలి తత్ప్రవాహంబునఁ బడి జీవకోటులు కొట్టుకొనిపోవుదురేమో యనుభయంబున ధర్మసంస్థాపకుండగు వేదవ్యాసుండు శ్రుతి

ధర్మబోధకంబులును, నిహపర సాధకంబులునగు మాత్స్యము, కౌర్మము, వారాహము, శైవము, వైష్ణవము, పాద్మము, గారుడము, బ్రహ్మవైవర్తము, భాగవతము, నారదీయము, మార్కండేయము, లైంగము, స్కాందము, బ్రహ్మాండము, ఆగ్నేయము, భవిష్యము, వామనము, బ్రాహ్మమునను పదునెనిమిదిపురాణంబులును రచియించి శిష్యులచే జగద్రంగమున వ్యాపింపఁజేసెను. క్రమముగా నాపురాణములుజగత్ప్రసిద్ధములై సర్వజనాదరణీయములై యధర్మ ప్రవాహసేతువులై నాఁడుమొదలు నేఁటివఱకును, జ్ఞానరత్నాకరములై, పఠనీయములై ప్రశంసనీయము లగుచున్నవి.

అందువలన వేదవ్యాసుండపరవిష్ణుస్వరూపుఁడై, సంయమీంద్రులలో శ్రేష్ఠుఁడై, ప్రభావగరిష్ఠుఁడై, అజ్ఞానులకు దివ్యదృష్టిప్రదాతయై, అవతరించిన విజ్ఞానచంద్రుఁడో యనవిరాజిల్లుచుండెను. ఈమహాత్ముఁడు నిరంతరమును నధర్మపరులను సన్మార్గమునకు మరలించుటయే తనజీవితోద్దేశముగా భావించుకొనుచుండును.

ఇట్లు భగవానుండైన వేదవ్యాసుం డొకానొకప్పుడు సకలగుణసంపన్నుండును, దేవతుల్యుండును నగునొకపుత్త్రునిఁ బడయవలయు ననియుద్దేశించి వాయుభక్షణంబు సేయుచు మహాదేవుంగూర్చి యత్యద్భుతంబగు కఠోరతపంబు గావింప నారంభించెను. ఇట్లొకసంవత్సరంబు గడచెను. అట్టితపఃప్రభా

వముచే నాతనిజటాపటలమునుండి యగ్నిజ్వాలలు బయలుదే ఱెను. ఇదియంతయుగాంచి త్రిభువనంబులవారును విభ్రాంతులై పోయిరి.

మహాదేవుం డమ్మహర్షితపంబునకు సంతుష్టుండైనాసా త్కరించి "మునిశ్రేష్ఠా! నీకచిరకాలంబుననే పంచభూతంబులం బోలి పవిత్రుండును, పరమకళ్యాణగుణుండును నగు నొకపుత్త్రుండు లభింపఁగలఁడు. ఆతఁడు మనఃప్రాణంబులు భగవదధీనంబులుగాఁ జేసి చరించుచు ముల్లోకంబులయందును శాశ్వతకీర్తినందఁగలఁడు" అని యానతిచ్చుటయు వ్యాసుండు పరమానందభరితుండై, మహాదేవునకు నమస్కరించి తపంబు చాలించి నిజాశ్రమంబునకుం బోయెను. అట నాతఁ డొకప్పు డగ్నికార్యంబుఁదీర్ప నుద్యోగించి యరణిమథించుచుండ నయ్యరణిదండమధ్యమునుండి పావకసమతేజుండును, దివ్యలోకసుందరుండును నగునొకకుమారుం డుదయించెను. వ్యాసనందనుం డగునాతఁడు శుకనామంబునఁ బ్రసిద్ధుండయ్యెను.

శుకుం డట్లుజన్మించినంతనే గంగాదేవి స్వయముగా నచ్చటికి వచ్చి, తనపవిత్రజలంబులచే నక్కుమారుని సుస్నాతుంగావించెను, అప్పుడే దండమును, కృష్ణాజినమును, స్వర్గమునుండివచ్చి యాతని నలంకరించెను. దేవతలు దుందుభిధ్వానములు సేయుచుఁ బుష్పవర్షము గురియించిరి. మహాదేవుండప్పుడు దేవీసహితుండైవచ్చి మహానందముతో నాతనికుపనయనంబు

గావించెను. దేవేంద్రుండాతని కపూర్వంబగు కమండలువును, దివ్యవస్త్రమును, బ్రసాదించెను. సర్వసముండగు నాతని చుట్టును గలసిమెలసి సర్వప్రాణులును సంచరించుచుండెను. ధర్మతత్పరుండగు నాతఁడు దేవగురునియొద్ద సకలవిద్యల నభ్యసించి కొలఁదికాలముననే సర్వజ్ఞుండయ్యెను సంతుష్టుండు కాఁజాలక తండ్రియగు వ్యాసునియొద్దకువచ్చి "నాయనా! నేను ముక్తి నభిలషించుచున్నాఁడను. కుమారుండనగు నాయందు దయయుంచి నాకామార్గమును బోధింపవలయు"నని ప్రార్థించెను.

ఆమాట విన్నంతనే పరమానందముచేఁ గృష్ణద్వైపాయనుని నయనములు బాష్పపూరితములై పోయెను. అప్పుడు బాదరాయణుండు కుమారునకు ముక్తిమార్గంబున కుపాయంబు నుపదేశించి "వత్సా! నీవుమిథిలానగరమునకుంబోయి జనకమహారాజుచెంత ముక్తితత్త్వమును గ్రహింపుమని చెప్పి వీడ్కొల్పెను.

మహాకవిచంద్రుఁడగు వ్యాసమునీంద్రుఁడు వేదశాస్త్రంబులయందలి సారము నుద్ధరించి యతిపవిత్రంబగు మహాభారతమును రచియించి, దీనినెట్లుశిష్యులచే లోకమునఁ బ్రవర్తిల్లఁజేయుదునా యని యాలోచించుకొనుచుండ బ్రహ్మదేవుం డప్పు డాతనికిఁ బ్రత్యక్షం బయ్యెను. పారాశర్యుండద్దేవుని యాకస్మికసందర్శనమున విస్మితుండై తత్తరంబున లేచి విధి

విధానంబుగ నవ్విరించి నర్చించి సుఖాసీనుం జేసి "మహాత్మా! నేనొకయద్భుతకావ్యమును రచియించితిని. వేదవేదాంగముల సారమంతయు నందు జేర్చితిని. భూతభవిష్యద్వర్తమానంబులం గూర్చియు, వివిధవర్ణాశ్రమధర్మంబులంగూర్చియుఁ, దపోబ్రహ్మచర్యాదినియమంబులంగూర్చియు. భూగోళఖగోళంబులం గూర్చియు నందువర్ణించియుంటిని. సృష్టితత్త్వమును,పుణ్యతీర్థక్షేత్రంబులను, నదీనదసముద్రంబులను, పర్వతగ్రామనగరంబులను, వనోపవనంబులను గూర్చి యందుఁ గీర్తించియుంటిని. రాజధర్మములను, ప్రజాధర్మములను, లోకధర్మములను, సర్వమునుగూడ నందు స్పష్టముగా నిరూపించితిని. కాని, యీవిశాలప్రపంచమునందు నాగ్రంథమును లిఖించి వ్యాపింపఁజేయఁగలలేఖకుఁ డెవ్వఁడును నాకగపడుటలేదు." అని విన్నవించెను.

ఆమాటవిన్నంతనే బ్రహ్మదేవుండు సాత్యవతేయుని మిగులఁబ్రశంసించి "మునిచంద్రా! ఆశ్రమంబు లన్నిటియందును గృహస్థాశ్రమముంబోలి సకలకార్యంబులయందును నీచే రచియింపఁబడినయిమ్మహాభారత ముత్తమోత్తమకావ్యంబగుఁ గాక! నీగ్రంథలేఖనంబునకై గణేశ్వరునిఁ బ్రార్థింపుము. ఆతఁడు నీయుద్దేశమును సఫలముసేయఁగలఁడు." అనిబోధించి,వనజాసనుం డంతర్హితుండయ్యెను.

తలఁచుకొన్నంతనే గణనాథుం డచ్చటసాక్షాత్కరించుటయు, వేదవ్యాసుండు భక్తిశ్రద్ధలతో యథోచితంబుగ

సత్కరించి, కుశాసనంబున నాతని నుపవసింపఁజేసి "గణనాథా! మహాభారతనామంబున నేనొక కావ్యంబు రచింపఁదలంచి తిని. నామనంబునఁ దోఁచినభావంబులను బ్రివాహరూపంబున నీకుఁ జెప్పుచుందును. నీవెప్పటికప్పుడు వానిని లిఖించుచు నా పరిశ్రమమును సార్థకముగఁజేయఁగోరెదను." అని చెప్పుటయు వినాయకుండు "మునీంద్రా! లిఖియించుచున్నట్టున నా లేఖిని యొక్కనిమిషమైన నాఁగకుండఁబని చేయునట్లు నీవు చెప్పఁగలిగితివేని నేను వ్రాయుట కంగీకరించెదను" అనుటయు వ్యాసదేవుండు "విఘ్నరాజా! నీవానతిచ్చినవిధంబున నేనేను విడువక చెప్పుచుందును. కాని, నీవుమాత్రము ప్రతిశ్లోకమునుగూడ బాగుగ నర్థము చేసికొని మఱివ్రాయుచుండవలయును." అనియెను.

విఘ్నేశ్వరుఁ డందులకు సమ్మతించెను. యుక్తిపరుఁడైన వ్యాసుఁడు మహాభారతరచనాసమయంబున లేఖకుఁడగువినాయకుఁడు తన్నుఁ దొందరపెట్టకుండుటకై, యచ్చటచ్చట గూఢార్థసంకలితంబులైనశ్లోకంబులనురచియించుచువచ్చెను. గణేశ్వరుఁడు వాని నర్థము చేసికొని వ్రాయులోపల నిమ్మహాకవి యనేక శ్లోకములరచించి, వచించి యించుకగుప్తిక్కతివ్రాఁకొను చుండెడివాఁడు. మహాభారతమునం దక్కడక్కడఁ గానవచ్చు నిట్టిశ్లోకములనే వ్యాసఘట్టములని చెప్పుకొనుచుందురు.

వేదవ్యాసుఁ డీవిధముగా మహాభారతమును రచించి ముందుగాఁదనపుత్త్రుండగుశుకదేవునిచే నధ్యయనంబు సేయించె

ను. అనంతర మీగ్రంథమును దగినశిష్యులకుఁ బ్రబోధించెను. ఈభారతసంహిత మొట్టమొదట నిరువదినాలుగువేల శ్లోకములుగ రచియింపఁబడియెను. అందుపాఖ్యానములేమియును లేవు. తరువాత నమ్మహర్షి భారతదేశమునందలిసకలవృత్తాంతములను గూర్చి, యేఁబదివేలశ్లోకములుగలయనుక్రమణికను దానితోఁ జేర్చెను. పిమ్మటనఱువదిలక్షలశ్లోకములుగలయొక భారతసంహితనురచించెను. అందు ముప్పదిలక్షలగ్రంథము దేవలోకమునందును, పదునేనులక్షలగ్రంథము పితృలోకమునందును, పదునాలుగు లక్షలగ్రంథము గంధర్వలోకమునందును, లక్షగ్రంథ మిప్పటికిని మానవలోకమునందును బ్రచారమునం దున్నట్లు తెలియవచ్చుచున్నది. ఈగ్రంథమును నారదుఁడు దేవలోకమునందును, అసితుండగుదేవలుఁడు పితృలోకమునందును, కుమారుండగుశుకుఁడు గంధర్వయక్షరాక్షసలోకంబులయందును, బ్రచారంబుఁ గావించిరి. వ్యాసశిష్యుండగు వైశంపాయనుఁడు మానవలోకమునం దీమహాభారతమును వ్యాపింపఁజేసెను.

వాస్తవముగా నింతటిమహాకావ్యము నెన్నఁడు నేభాషయందును నేమహాకవియు రచియించియుండలేదు. మహారాజగు జనమేజయుని సర్పయాగసమయంబున వేదవ్యాసానుమతంబున నాతనిశిష్యుండగు వైశంపాయనుఁడీమహాభారతమును బఠించియుండెను. ఆతనివలన గ్రహించి లోమహర్షణపు

స్తుతిండగునుగ్రశ్రవుఁడు నైమిశారణ్యంబునఁ గులపతియగు శౌనకునిచే నాచరింపఁబడుచున్న ద్వాదశవార్షికంబగు సత్రయాగసమయంబునసభ్యులగుమహర్షులందఱకును నిమ్మహాభారతకథను వినిపించెను. తరువాత నెన్నిమహాసభలయం దీమహాభారతము కీర్తింపఁబడియెనో లెక్కింపఁజాలము.

కృష్ణద్వైపాయనునిచేరచియింపఁబడినపరమపవిత్రంబగు నిమ్మహాభారతము కేవలముఁ బంచమ వేదముగా మహర్షులందఱును బ్రశంసించి యున్నారు. వసంతకోకిలమధురకంఠస్వరము నాలకించువారికిఁ గర్కశంబగుకాకస్వరము చెవికెక్కనట్లే, మహాభారతేతిహాసమునందలిరుచిమరగినవారి కితరకావ్యము లేవియు రుచింపఁజాలవు. పంచభూతములనుండి సృష్టియేర్పడునట్లే సర్వోత్కృష్టంబగు నీయితిహాసమునుండి కవిగణంబుల కవితాసృష్టి యుత్పన్నంబగుచుండును. కవులందఱును నీభారతేతిహాసమును నిరంతరము నుపాసించుచుందురు. పౌరాణికులు పరమభక్తిపూర్వకంబుగ నిమ్మహాభారతమునుబఠించి ప్రజాలోకమును బాపవిముక్తులుగాఁ జేయుచుందురు. సర్వధర్మరత్నాకరమగు నిమ్మహాకావ్యమును బఠించువారికి సకలార్థములును సిద్ధింపఁగలవు.

ధర్మజ్ఞుండును, ధర్మబోధకుండును, ధర్మసంస్థాపకుండును, మహామతియు, మహాతపస్సంపన్నుండును, మహాకవియునగు నిమ్మహాత్ముఁడు కేవలము నారాయణావతారమని చెప్పుట

కేమియును సందియము లేదు. ఈతఁడు మహాభారతేతిహాసము ను రచించుటయే కాక, మాతృవాక్యపరిపాలనంబునకై భరత వంశమునకుఁబ్రతిష్ఠాపకుఁడై యాకారణమునఁదానుగ చించిన కావ్యమునఁ దానొకప్రధానపాత్రముగూడ నయ్యెను. కావు ననే భరతవంశము నుద్ధరించుటకై యాతఁ డెన్నియో ప్రయత్నములఁ జేసెను.

ఈమహాత్ముని దివ్యజీవిత మంతయును గేవలము లోక కల్యాణముకొఱకే వినియోగింపఁబడియెను. ఇమ్మహాకవికావ్య రచనమంతయును గేవలధర్మాధర్మోపదేశముకొఱకే యుద్దే శింపఁబడియెను.

ఈప్రజ్ఞానిధి బుద్ధివిశేషమంతయును, నిహసంసార మును బవిత్రముగఁ జేయుటకును బరతత్త్వమును దర్శనీయ ముగ నొనర్చుటయందును నుపయోగపడియెను. ఈయవతార మూర్తి లోకసంగ్రహమునకై కావించు కర్మకలాప మంత యునుగూడ నిరపేక్షమైనదియే. పరార్థజీవనుఁడగు నిమ్మహా పురుషునకు స్వప్రయోజనం బనునది యేదియును లేదు. కావు ననే యీ వేదవ్యాసుఁడు విశ్వప్రియుఁడై విశ్వమయంబులును విశ్వబోధకంబులును విశ్వజనరంజకంబులును విశ్వశ్రేయోదా యకంబులును నగుతనమహాకావ్యములతోఁగూడఁజిరంజీవియై విశ్వసంస్తవనీయచరిత్రుఁడయ్యెను.



# చిరంజీవులు.

## ౪ హనుమంతుఁడు.



విద్యలను నేర్చి శ్రీరామ ♦ విభునిఁగొల్చి
లంకఁగాలిచి రావణు ♦ పొంకమణఁచి
రుద్రుఁడై క్రూరదనుజులఁ ♦ ద్రుంచినట్టి
**మా హనూమంతు గుణవంతు ♦ మదిఁదలంతు.**

మహాభక్తుండగు నీహనుమంతున కంజనా కేసరులు జననీజనకులు. ఈతఁడు జగత్ప్రాణుఁడగు వాయుదేవుని యనుగ్రహమున వైశాఖబహుళదశమినాఁడు జనియించెను. ఇతఁడు పుట్టినయాఅవదిన మమావాస్య యయ్యెను. ఆనాఁడీచిన్నికుమారుఁడు తాను శయనించినడోలికనుండి లేచి సమీపమున. దలియొకచిన్నగుట్టపైకిఁ బ్రాఁకిపోయి మెల్లఁగఁ దలయెత్తి తూరుపుదెసవంకఁ దిలకించి యప్పుడే యుదయించుచున్న బాలభానునింగాంచి యాతనిబింబ మొక యెఱ్ఱనిపండని భావించి దానిం గైకొని భక్షించుటకై మింటి కెగయ నారంభించెను ఆసమయంబున వాయుదేవుఁడు భాస్కరుని వేఁడివెలుంగులచేఁ దనకుమారున కెట్టియాపద తటస్థించునో యని శంకించి తనచ

ల్లనిసుగంధవాయువులతో నేఁదేర్చుచు నాతని ననుసరించి పోవుచుండెను.

హనుమంతుం డశ్రమంబున నట్లంతరాళము నధిగమించి నిర్భయముగా బాలార్కబింబము నొడిసిపట్టి బాల్యచాపలముచేతను, ఫలభ్రాంతిచేతను నోటఁగబళించుటయు నా వేఁడి వేలుపుసోఁకుడుచే నోరుముఱుమన నూఁదుకొనుచు నాబింబము నొకచేతినుండి మఱియొకచేతికిమార్చిమార్చి త్రిప్పికొనుచు వేఁడిచల్లార్చుటకై ప్రయత్నించుచుండెను. ఆనాఁడు సూర్యగ్రహణంబగుటచే యుక్తసమయమునకు రాహువచ్చటికి వచ్చి రవిమండలమును గ్రసింపఁబోయి కుమారుండగు హనుమంతునిఁగాంచి వీఁడెవ్వఁడో క్రొత్తమూతిక్రొత్తరాహువువచ్చి తనకంటెముందుగ సూర్యుని మ్రింగుచున్నాఁడనిఁ కోపించి యొక్కయుదుటున నంజనీతనయునిపైఁబడి యొకతీవ్రప్రహారముంగావించెను.

ఇదివఱకే దివాకరుని దిగమ్రింగుటకై ప్రయత్నించి సఫలమనోరథుఁడు కాఁజాలక శ్రమపడుచున్న వాయుపుత్త్రుండప్పుడా రాహువుంగాంచి యదియేదో నల్లనిపండని భ్రమించి యాతనిఁ బట్టుకొని నులుమనారంభించెను. అక్కపికుమారుని కరమర్దనమును సహింపఁజాలక రాహువు భయభ్రాంతుఁడై "హా పురందరా ! రక్షింపుము. రక్షింపుము. ఈక్రూరగ్రహమేదియోవచ్చి గ్రహాచారమునంతను మార్చివైచుచున్నది."

అని యింద్రునిఁ బ్రార్థింపఁదొడంగెను. అయ్యార్తనాదము నాలకించి యమరేంద్రుం డైరావతము నధిరోహించి యతిత్వరితంబుగ నచ్చటికివచ్చుటయు నాంజనేయుం డదియేదియో చల్లని తెల్లనిఫలమని యెంచి వెల్లయేనుఁగుతోఁగూడ విబుధనాథునిఁబట్టి మ్రింగఁబోయెను. బాలబుద్ధియగుపావని కప్పుడగపడినదంతయు ఫలమయముగనే కన్పట్టుచుండెను.

ఆవానరకుమారుని దుండగీనితనమునకు సురేంద్రుఁడు కోపించి యాతనిపై వజ్రాయుధమును విసరెను. అయ్యాఘాతముచే భగ్నహనుండై యాహరికుమారుండుమూర్ఛిల్లెను. అందువలననే యాతనికి హనుమంతుఁ డనునామము కలిగెను. ఇట్లు తనకుమారుని దేవేంద్రుం డన్యాయముగఁ బ్రహరించి మూర్ఛిల్లఁ జేసెననుకినుకచేఁ బవనదేవుం డక్కుమారుఁ గ్రిందఁబడకుండ నంతరాళమున నిలిపికొని జగత్సంచారము మానివైచెను. అందుచే నిర్వాతమగు నంతరిక్షమునుండి యింద్రాది దేవతలందఱును దమతమ విమానములతో స్తంభించిపోయిరి. సకలజీవులకును నూపిరాడుట లేదు. ఆకాలమునం దిట్టి వాయునిరోధమునకుఁ గారణ మేమని యోచించి బ్రహ్మదేవుం డచ్చటికి వచ్చి సర్వము దెలిసికొని శక్రుని మందలించి హనుమంతుని బ్రదికించి యతనిఁ జిరంజీవిగ నాశీర్వదించి పవమాను ననునయించి లోకసంచారము నెప్పటియట్లు గావించి యంతర్హితుండయ్యెను.

ఇట్లు సురక్షితుండగు పావని తమతల్లిదండ్రులకు దినదినము నొకకొత్తయానందముం గూర్చుచుఁ దనసద్గుణంబుల తోడను బలపరాక్రమములతోడను శుక్లపక్షచంద్రునివలెఁ గ్రమక్రమముగా వర్ధిల్లుచుండెను. ఆతని కించుక లోకజ్ఞానము కలిగినతోడనే తల్లిదండ్రులయనుమతంబున సమీపాశ్రమంబునకుం బోయి మునికుమారులతోఁ జదివికొనుచు నంతమాత్రమునఁ దనివి సనక సర్వవిద్యలను దనకు బోధింపఁగలగురుం డెవ్వఁడై యుండునని యోచించి భాస్కరునికంటెఁ బండితుఁ డీజగంబున నెవ్వఁడును లేఁడని తెలిసికొని యాతనిచెంతకుఁ బోయి చదువుకొనుటకు నిశ్చయించుకొనియెను. అనంతరమాతఁడు గురుజనానుమతంబువడసి యాదిత్యభగవానునిచెంతకుం బోయి, భక్తివినయంబులతోఁ బ్రణామంబుచేసి "ఓలోకబాంధవా! నాకు విద్యాదానము సేయవలయు"నని ప్రార్థించెను.

వేదమూర్తియగు ప్రభాకరుం డాతని భక్తిశ్రద్ధలకు సంతసించి యించుక సంశయించి "కుమారా! అనునిమిషమును లోకసంచారముఁ గావించుటయే నావిధాయకకృత్యమై యున్నది. ఇట్టి నాచెంత నీవు విద్యాలాభము నెట్లుపొందఁగలవు? పాపము! నీవెంతయో యాశపడి వచ్చితివిగాని నీకోర్కెఁ దీర్చుట కుపాయ మగుపడుటలేదు." అని వచించుటయు హనుమంతుండు చేతులు జోడించుకొని "స్వామీ!

నాకు విద్యాభిలాష మిక్కుటముగ నున్నది. అందుకొ అకు నేనెట్టికష్టములనైన ననుభవింపఁగలను. అనుగ్రహించి మీరంగీకరించినచో నుదయశైలమునం దొకపాదమును, నపరశైలమునం దొకపాదమును నిలిపి నిత్యము మీవెంటనే యుండి మీయొద్దఁ జదివికొనుచుందును. అందువలన నాకెట్టి యాయాసమును లేదు. నేను మీనిత్యకృత్యముల కెంతమాత్రము నంతరాయము గలుగనీయను. విద్యాభ్యాసమునందలి యాశయే నాకెట్టిశక్తిని గల్పింపఁగలదు. మీరు చెప్పినదంతయు శ్రద్ధగా విని గ్రహించుచుండుటయే కాని, యూరక మరలమరలఁ బ్రశ్నించుచు మీకు వేసటఁ గల్పించువాఁడను గాను. మహాత్మా! నన్ను మీశిష్యునిగా నాదరించి యనుగ్రహింపుఁడు" అనియెను.

హనుమంతుని విద్యాసముత్సాహమునకును, విశ్వవ్యాపనశీలంబగు నాతనియద్భుతశక్తికిని, సవిత్రుదేవుండు సంతోషించి శ్రద్ధాన్వితుండగు నిట్టియుత్తమశిష్యునకు బోధించిన విద్య సార్థకంబు కాఁగలదని నిశ్చయించి యందులకంగీకరించెను. ఉత్తములకు నుత్తమసంకల్పములు శుభముహూర్తముల యందే కలుగుచుండును. ఆదిత్యుఁ డాంజనేయుని శిష్యుఁడుగా నంగీకరించిన యాముహూర్తమే శుభముహూర్తమయ్యెను. ఆముహూర్తమునందే విశ్వసంచారియగు భాస్కరునియొద్ద జగత్ప్రాణతనయుండగు హనుమంతుఁడు విశ్వమూర్తిందాల్చి

చరించుచు విద్యారంభముఁ గావించెను. ఇట్లు క్రమముగా నాతఁడంశుమంతునిచెంత నఖిలవిద్యల నభ్యసించి సంపూర్ణ విద్యానిధియై గురుననుగ్రహంబును సదాశీర్వాదంబును బడసి కృతార్థుఁడై సెలవుగైకొని కిష్కింధానగరమందున్న తనజననీ జనకులయొద్దకు వచ్చి వారికిఁ బరమానందముం గూర్చెను.

ఆనగరమునందలి కపిశేఖరు లందఱును విద్యానిధియు, బలపరాక్రమ సంపన్నుఁడును, గుణనిధియునగు కేసరిపుత్త్రుని మిగులగౌరవభక్తి తాత్పర్యములతో నాదరింపఁదొడంగిరి. క్రమముగా నాతనిమహత్త్వముం గ్రహించి మర్కటేశ్వరుండును, మార్తాండతనయుండు నగుసుగ్రీవుఁ డాతనిఁ దనమంత్రిగాఁ జేసికొనియెను. అంజనాదేవిని బట్టి యాయిరువురకును బంధుత్వముకూడఁ గలదు. అందువలన నయ్యిరువురకు నన్యోన్యానుబంధము దినదినప్రవర్ధమాన మగుచుండెను. ఇట్లుండఁ గాల కారణవశంబున సుగ్రీవునకు సహోదరుండగు వాలితో విరోధమేర్పడి రాజ్యభంగ మగుటయు నాతఁడు మంత్రిసామంతపరివారపరివృతుండై ఋష్యమూకాచలంబు నాశ్రయించి యట నివసించుచుండెను.

అంతఁ గొంతకాలంబునకుఁ బితృవాక్యపరిపాలనంబు సేయందలంచి సీతాలక్ష్మణసహితుఁడై వనవాసముచేయుచున్న శ్రీరామచంద్రమూర్తి విధినియోగంబున సతీవియోగముం గాంచి సంతప్తచిత్తముతో సతినన్వేషింప నడవులఁదిరుగుచు

గ్రముగా లక్ష్మణసహితుఁడై ఋష్యమూకాచలవనప్రాంతమునకు విచ్చేసెను. భ్రాతృభయవిహ్వలుఁడై వలసవచ్చియున్న సుగ్రీవుఁడు దూరమునుండి ధనుర్ధరులును, తాపసవేషధారులునగు రామలక్ష్మణులం గాంచి తనవినాశంబునకై యున్న చేఁ బంపఁబడినశత్రుప్ర లేమోయని భ్రమించి మతిమంతుఁడగు హనుమంతుం బిలిచి వారివృత్తాంతముఁ దెలిసికొనిరమ్మని పంపించెను.

సర్వజ్ఞుండగుసామీరి స్వామియాజ్ఞ ననుసరించి రామలక్ష్మణులకడకుం బోయి సవినయంబుగ సందర్శించి సవిస్తరంబుగ వారివృత్తాంత మంతయుఁ దెలిసికొని తనప్రభుండగు సుగ్రీవునియవస్థయు రామలక్ష్మణులయవస్థయు నొక్కటేరీతిగ నున్నదని గ్రహించి రాజనీతినిపుణుండుగావున నీయిరువురకును బరస్పరమైత్రిం గూర్చినచో నన్యోన్యసాహాయ్యమువలన నభ్యుదయము నందఁగలరని యూహించి తనయాగమనవృత్తాంతమును, దనప్రభుండగు సుగ్రీవునియునికియు వారి కెఱింగించి తనప్రజ్ఞయంతయు వినియోగించి సూర్యశిష్యుండగు నాహనుమ సూర్యకులాలంకారులగు రామలక్ష్మణులకును సూర్యతనయుండగుసుగ్రీవునకును సూర్యచంద్రాగ్నిసాక్షికముగ మైత్రినిసంఘటిల్లఁజేసి తనమంత్రిత్వమును సార్థకముచేసికొనియెను. దూరదర్శియుఁ బ్రత్యుత్పన్నమతియుఁ బ్రతిభాశాలియు నగు నమ్మంత్రిశేఖరుని మిత్రలాభతంత్రమూలముననే సుగ్రీవునకు శత్రువిజయమును రాజ్యలాభమును జేకూరినవి.

పిమ్మట సుగ్రీవుఁడు స్వస్థచిత్తుఁడై మిత్రకార్యనిర్వహణమునకుఁ బ్రయత్నములఁ గావింపనారంభించెను. ఆంజనేయునిం జూచినది మొదలుగ శ్రీరామచంద్రున కాతనిగుణగణంబుల యందును నాతనిభక్తిశ్రద్ధలయందును గౌరవాభిమానములు హెచ్చుచుండుటచే నాతనిఁదనయాత్మీయునిఁగా భావించుకొనఁ జొచ్చెను. సీతాన్వేషణంబున కాతఁడే తగినసమర్థుఁడని రామలక్ష్మణులకు దృఢవిశ్వాసము కలిగెను. అందుచేతనే రామభద్రుఁడు, కపివరులందఱును సీతను వెదకుటకై పోవుసమయంబునఁ దనయంగుళీయకము నానవాలుగా హనుమంతునకే యొసంగెను.

ఎంతటికార్యభారమునైనను వహించి కష్టములను గణింపక స్వామికార్యమును నిర్వహించుటయందు హనుమంతుని మించినసమర్థు లెవ్వరునుండరు. ఆతఁడు స్వామికార్యనిర్వహణమునకు బద్ధకంకణుఁడై కపివీరులతోఁ గలసిపోయెను గుంపులుగుంపులుగా నందఱు నన్నిదిక్కులకునుబోయి సీతను వెదకనారంభించిరి. కాని, యాదేవి యెందును గాన్పింపదయ్యెను. క్రమముగాఁ గొంతకాలమునకందఱును దక్షిణసముద్రతీరమునఁ జేరికొని నాలోచింపనారంభించిరి.

ప్రసంగవశమున సీతను లంకాధిపతియగు రావణుఁడెత్తికొనిపోయినట్లు వారికిఁ దెలియవచ్చెను. లంకకుఁ బోవుటకై మహాసముద్రమును దాఁటుటకంటె నుపాయాంతరమేమి

యును లేదు. అట్టి దుస్తరకార్యమును సాధించుటకుఁ గపివీరు లెవ్వరును సాహసింపలేకపోయిరి. అప్పుడు మహాబలనందనుఁ డగు నాంజనేయుఁడు శ్రీరాముని యాదరమును, సుగ్రీవుని యాజ్ఞయు నూతగాఁ జేసికొని కపివరులందఱు నాశ్చర్యముతోఁ గనుఁగొనుచుండ నవలీలగా నంతరాళమున కెగసి యంబుధి నుత్తరించి యశ్రమంబున లంకాద్వారమునఁ బ్రవేశించెను.

మహాత్కార్యములకు విఘ్నములే విశేషముగాఁ దటస్థించుచుండును. లంకఁ జేరితిమి గదా యని సంతసించుచున్న హనుమంతునకు లంకిణి యడ్డమువచ్చి లోపలికిఁ బ్రవేశింపనీయకుండెను. మహావీరుఁడైన పావని యాఁడుదానితోఁ బోరుటకు శంకించి సామోపాయముచేఁ దప్పించుకొనిపోవలయునని ప్రయత్నించెను. కాని, సాధ్యముకాకపోయెను. తుదకాతనికి లంకిణిని జావఁగొట్టి లంకానగరమునఁ బ్రవేశింపవలసివచ్చెను. సామీరికిఁ గామగమనము, కామరూపము మొదలుగాఁగల దివ్యశక్తులుగలవు. అప్పు డాతఁడు సూక్ష్మాకృతిని ధరించి సీతాదేవికొఱకు లంకానగరమంతటను శోధింపనారంభించెను. ఆరాత్రివేళ నానగరమంతయు మహావైభవసమన్వితమై మనోమోహనకరమై యలరారుచుండెను. సీతను వెదకుటయందే నిమగ్నచిత్తుఁడై యున్న వాయునందనున కవియేవియు నగపడుట లేదు. మేడలు, మిద్దెలు, తోఁటలు, దొడ్లు, కోటలు, పేఁటలు అంగణములు, అంతఃపురములు, వేయేల, లంకానగరంబునందలి ప్రతిప్రదేశమును బరిశోధించెను. కాని, యాతని కగపడలేదు.

స్వామికార్యతత్పరుఁ డగుసామీరి యప్పుడు తనపరిశ్రమయంతయు నిరర్థకమయ్యెఁగదా యనువిచారముతో లంకాంతర్భాగమునందున్న యశోకవనమునకుఁ బోయి యొక వృక్షశాఖాగ్రమునఁ గూరుచుండి చింతించుచుండెను. అంతలో నదృష్టవశమున సమీపమునుండి "రామా! రామా!" యను నార్తనాద మమృతరసమువలె నాతనిచెవులకువింపుగావించెను. తోడనే యాతఁ డులికిపడి "నరఘాతుకులగు నసురులచే నిండియున్నయీనగరమునందు మహావిష్ణుస్వరూపుఁడైన శ్రీరామచంద్రమూర్తిని దలఁచువా రెవ్వరై యుందురు?" అని భావించి చటాలున నటకుఁబోయి యొకయశోకవృక్షముక్రింద మూర్తీభవించిన శోకదేవతలవలెఁ గూర్చుండి పరిదేవనంబు సేయుచున్న యొకస్త్రీమూర్తిం గాంచి యామెయే సీతయైయుండునని యోచించి సమయముఁజూచి దర్శించి సత్యము తెలిసికొనవలయు నని నిశ్చయించుకొని యాచెట్టుకొమ్మపైఁ గూర్చుండియుండెను. ఆమెచుట్టునుమూఁగియున్న వికృతస్వరూపులగు రాక్షసస్త్రీలందఱును నామె ననేకవిధములఁ దర్జనంబులతో, దురోబ్బధలుసేయుచు బెదరించుచు నెంతకు నామె తమకు వశీకృతురాలు గాకుండుటచే విసిఁగి వేసారి క్రమముగా నందఱును నిదురించిరి. ఆసతీమణిమాత్రము ధూళిధూసరితగాత్రముతో మలినవసనముతో, నేకవేణితోఁ బతివియోగదుఃఖముతోఁ, బరాభవసంతాపముతో నిద్దురయనుమాటలేక "రామా! రామా" యని యుల్లేపలవించుచుఁ గూర్చుండియుండెను.

హనుమంతుఁ డదియంతయుంగాంచి యామె జానకీదేవియే యని నిశ్చయించుకొని యామెను దర్శించుట కిదియే యదనని భావించుకొని మెల్లఁగఁ జెట్టుకొమ్మనుండి క్రిందికిదిగి శ్రీరామనామసంకీర్తనమును గావించుచు నామెను సమీపించి "తల్లీ! నేను శ్రీరామదూతను హనుమంతుఁడనువాఁడను. స్వామిపంపున నీసేమ మరయవచ్చితిని. పుత్త్రవాత్సల్యముతో నన్నుఁదిలకించి నిస్సంశయముగ నీకష్టసుఖములను నాకెఱింగింపుము." అనినమస్కారపూర్వకంబుగా విన్నవించుటయు నింతవఱకును రాక్షసమాయలచే నెన్నియోకష్టములఁబడి మతిచెడి యున్నసీతాదేవి యాతని విశ్వసింపఁజాలక కోఁతిరూపమున వచ్చినరావణుఁడే యని భావించి ప్రతివచనం బీయకుండెను.

అప్పు డంజనానందనుఁడు వినయవినమితగాత్రుండై మృదుమధురస్వరంబున "తల్లీ! నాయెడల నీకెట్టిసంశయంబును వలదు. నేను రక్కసుఁడనుగాను. నిశ్చయముగా నీస్వామిసేవకుఁడనని నమ్ముము. భయభ్రాంతిచే వికలహృదయవైయున్ననీకింకనుసంశయము వదలదేని యీశ్రీరామ ముద్రికం జూచియైనను నామాట విశ్వసింపుము." అనిపలుకుచు శ్రీరామాంగుళీయకమును సీతాదేవి కర్పించెను. దానిం గాంచినంతనే సీతాదేవి ప్రాణేశ్వరుని దిలకించినట్లగుటయు నొక్కసారిగా నుప్పతిల్లిన యానందశోకావేగముచే మూర్ఛిల్లి యంతలోఁ దెలివి దెచ్చుకొని గద్గదస్వరముతో రామలక్ష్మణులసేమ మడిగి

తెలిసికొని తనకష్టముల నాతని కెఱిఁగించి తనచూడామణి విభున కానవాలుగానొసంగి యాశీర్వదించి పంపించెను,

ఆంజనేయుం డామణిని గైకొని యింతశీఘ్రమపడి లంకా నగరమునకు వచ్చినందుకుఁ దనసంగతి లంకలోనివారికిఁ దెలి యకుండఁబోవుట యుచితముగాదని తలంచి యశోకవనమునఁ బ్రవేశించి యందలిఫలభూరుహములను బుష్పలతలనుగూడ విఱిచి చెఱచి విహరింపనారంభించెను. రావణుఁడు వనపాలుర వలన నీవృత్తాంతముఁ దెలిసికొని ససైన్యముగ నక్షయకుమా రుని నాతనిఁ గట్టితెచ్చుటకై పంపించెను. జగదేకవీరుఁడగు మహాబలనందనున కాయసురసైన్య మేపాటిది? అతనిచేతిలో నక్షయకుమారుఁడు సపరివారముగా నిహతుఁడై పోయెను. తరువాతఁ బరాక్రమధనుండగు నింద్రజిత్తువచ్చి బ్రహ్మాస్త్రము చే హనుమంతునిబంధించి తీసికొనిపోయెను.

బ్రహ్మాస్త్రముచేఁ గట్టువడియు, బలవంతులగుశత్రువు లనడుమ నేకాకియైయుండియుఁ బవననందనుఁడు రావణసభా మండపమున నిర్భయముగా నిలిచి యాతనిదుర్నయంబులనుగ్గ డించి తృణీకరించి ధర్మోపదేశముఁ గావించెను.ఆమాటలకుదశ కంఠుఁడు మండిపడి యీదురాత్ముని తోఁక గాల్చిపంపివేయుఁ డని యాజ్ఞాపించెను. తోడనే రాక్షసులందఱును హనుమంతు నివాలమునకు నూనెగుడ్డలనుజుట్టి ముట్టించిరి. వాయునందనుఁ డప్పుడు శత్రువులుగావించినపరాభవముఁగూడఁ దనకుఁ గార్య

సాధక మే యయ్యెనని యుత్సహించి లంకానగరమునందలిసౌధములమీఁదికి లంఘించి తనవాలాగ్నిచేఁబట్టణమంతయు భస్మీభూతముగాఁ జేయనారంభించెను. కొలఁదిసేపటిలోఁ బురమంతయు బుగ్గియై పోయెను.

తరువాత నాతఁడు మహోత్సాహముతో సీతయొద్దకుఁ బోయి, దూరముగ నిలిచి "అమ్మా! ఇఁకవిచారింపకుము. అధర్మపరాయణుఁడగునసురేశ్వరున కంత్యకాలము సమీపించినది, ఈలంకాదహనమే దానికంకురార్పణమైనది. అచిరకాలములోనే శ్రీరామచంద్రమూర్తి వారిధి బంధించివచ్చి పుత్త్రమిత్రకళత్రాదులతో రావణసంహారంబుఁగావించి నిన్నుద్ధరింపఁగలఁడు. తల్లీ! ధైర్యమువహించియుండుము. నేఁబోయివచ్చెదను. సెలవిమ్ము" అని యామెకు నమస్కరించి వీడుకొని యొక్కయుదుటున సముద్రతీరమునకులంఘించి తోఁకచిచ్చుఁజల్లార్చుకొని గగనమార్గంబున మహేంద్రాద్రికిఁ జేరి పట్టరాని సంతోషముతో శ్రీరామనామసంకీర్తనముఁ గావించుచుఁ దనరాకకై వేచియున్న కపిపుంగవుల వెంటఁబెట్టుకొని పోయి శ్రీరామచంద్రుని దర్శించి సీతాకుశలవార్తయు, లంకాదహనచరిత్రంబును, విన్నవించి సన్నుతులం గాంచెను.

తరువాత రామలక్ష్మణులు సుగ్రీవసేనాసహాయంబున లంకావిజయయాత్రకు బయలుదేఱిరి. మధ్యమార్గమున సముద్ర మడ్డముగానుండెను. దానికొక సేతువు నిర్మింపవలసివచ్చెను.

కపివీరు లందఱును నీలునిసహాయంబునఁ బర్వతములను బెకలిం చితెచ్చి సేతువును నిర్మించిరి. ఆఘనకార్యమునందు మిగిలిన కపివీరులందఱును నెంతపనిచేసిరో మనహనుమంతుఁడొక్కఁడు నంతిసాయముఁ గావించెను. అందువలన మహాసైన్యముతో రామలక్ష్మణు లతిసులభముగా లంకానగరమును జేరి ముట్ట డింపఁగలిగిరి.

యుద్ధ మారంభమయ్యెను. అందు హనుమంతుఁడు మహావీరుఁడై యసమసమరవిహారము సేయుచు నజేయులగున నేక రాక్షసయోధుల నశ్రిమంబుగ నురుమాడుచుండెను. రాక్షససైన్యమంతయు గుట్టలుగుట్టలుగా బీనుఁగుపెంటలై పడి పోవుచుండెను. ఒకప్పుడు దుర్జయుండగు నింద్రజిత్తు వరగర్వం బున మదించి దివ్యరథంబుతో రణరంగమునఁ బ్రవేశించి శ్రీరామసేననంతను జెల్లాచెదరుగఁ జేయుచుండెను. అతిరి లోకవీరు నెదిరించుట కెవ్వరికిని సాధ్యము కాకుండెను. అప్పుడు మహావీరశేఖరుండగు లక్ష్మణుండు శ్రీరామచంద్రునియనుమ తింబడసి మేఘనాథునితో యుద్ధముచేయుటకుఁ బూనుకొనియె ను. రామలక్ష్మణులు తాపసవేషములతో నున్నవారుగావున వారికి రథాధివాహనంబులు లేకుండెను. అప్పుడు స్వామిభక్తి తత్పరుండగుసమీరనందనుఁడు మహావీరుఁడగు లక్ష్మణునకు వాహనస్వరూపుఁడై యాతనిఁ దనమూపున నెక్కించుకొని యింద్రజిత్తు నెదిరించుటకుఁ దోడుపడియెను. ఆతనిసహాయము

వలననే లక్ష్మణుం డప్పు డశ్రమంబున నింద్రజిత్తును సంహ రింపఁగలిగెను.

పుత్త్రమరణదుఃఖముచే రావణుఁడు మహాసైన్యముతో రణరంగమున కేతెంచి రామలక్ష్మణులను ససైన్యముగ సంహ రింపవలయుననుపట్టుదలతో మహారణము సేయఁదొడంగెను. ఆదారుణయుద్ధంబున నమోఘంబగురావణుని దివ్యశక్తిచే లక్ష్మణకుమారుండు మూర్ఛితుఁడై పడిపోయెను. శ్రీరామచం ద్రుఁ డప్పుడు తనసహోదరుఁడు మరణించె ననిభావించి బాలునివలె రోదనముచేయ నారంభించెను. కపిసేనయంతయు నిరుత్సాహసంక్షుభితమై పోయెను. అప్పుడు ధన్వంతరిసమా నుండగు సుషేణుండు లక్ష్మణునిఁబరీక్షించి యాతఁడు మరణిం పలేదనియు సంజీవకరణిచే జీవింపఁగలఁడనియు, దానిని వెల్ల వాఁకుండఁదెచ్చి యుపయోగింపవలయుననియు నెఱిఁగించెను. సహస్రాధిక యోజనములదూరమునం దున్న సంజీవి నట్లుదెచ్చు టకు సామర్థ్య మెవ్వరి కున్నది? కపిసేనలో నందఱును నొకరి మొగమొకరు చూచుకొననారంభించిరి. నిరాశాసముద్రమున మునిఁగిపోవుచున్న శ్రీరామచంద్రున కప్పుడొక యాశాతరంగ ము తేల్చినట్లయ్యెను.

రఘువీరుం డపుడు తనశోకము నించుకయడంచుకొని హనుమంతునిదివ్యశక్తి నెఱింగినవాఁడుగావున, నాతనియందే పరిపూర్ణవిశ్వాసముకలవాఁడుగావున, నాత్మబంధుస్వరూపుఁడ

గునంజనాతనయునిఁ బిలిచి "నాయనా! ఈతమ్ముఁడు నీతమ్ముఁడు. నాతమ్ముఁడని చెప్పుకొనుటకు నాకెట్టియవకాశము లేదు. ఈయాపత్సమయమునందు నేనీతని కెట్టియుపకారమును జేయఁజాలకున్నాఁడను. దుఃఖభారముచేఁ దూలిపోవుచున్నాఁడను. అనితరదుర్లభమైన యాదివ్యౌషధమును దెచ్చి నీతమ్ముని నన్నును బ్రదికించుకొనుము. నీకెల్లయెడల శుభంబగుఁగాక." అని యతి కరుణముగా వేఁడికొనియెను.

హనుమంతున కెంతటియసాధ్యకార్యమైనను, నిర్వహింపఁజాలనేమోయను సంశయమైనను లేదు. స్వామికార్యమనిన నాతని కెక్కడనులేని ధైర్యమును, నెక్కడనులేని మహాశక్తి యుఁగలిగి యాతఁడుత్సాహముచే నుబ్బిపోవుచుండును. అప్పుడాతఁడు గోటితోఁగొండలను మీఁటివేయఁగలుగుచుండును. ఇప్పుడట్టియుత్సాహమే యతనికిఁగలిగెను. సముద్రముదాఁటినవానికి సంజీవిఁ దెచ్చుట యేపాటిపనియని తోఁచెను. ఇఁక మాఱుమాటచెప్పక హనుమంతుఁడు శ్రీరామచంద్రునియొద్ద సెలవు గైకొని సుషేణునివలన నెల్లసంగతులను దెలిసికొని తత్క్షణమే సంజీవి తెచ్చుటకు బయలుదేఱెను.

అట్లు పోవుచున్నయాంజనేయునకు మార్గమధ్యమునం దనేకములగు నంతరాయములుకలిగెను. కాని, కార్యతత్పరుఁడగునాతఁడు వానినన్నిటినిఁదప్పించుకొని యతివేగముగఁబోయి సంజీవిపర్వతమును సమీపించెను. సుషేణుఁడు చెప్పినలక్షణము

లనుబట్టి సంజీవకరణిం దెలిసికొనుటకై ప్రయత్నించెను. కాని, దివ్యౌషధీలతలచే నిండివెలుంగుచున్న యాశైలరాజమునందుఁ బ్రధానవస్తువును బరీక్షించి కైకొనుట కాతని కవకాశము లేక పోయెను. హనుమంతునకుఁ గార్యనిర్వాహణమే ప్రధానము గాని తత్ప్రయత్నమునఁ గలుగుకష్టముల హెచ్చుతగ్గులంగూర్చి యాతఁ డాలోచించువాఁడు కాఁడు. కార్యసిద్ధికొఱ కెంతకష్టమునైనను సహింపఁగలస్వభావముకలవాఁడు. కావుననే మన హనుమంతుఁ డిప్పు డవకాశములేని యీస్వల్పసమయమునం దోషధీపరిశీలనాభారమును దనతలపైఁబెట్టుకొనక, స్వామికార్యముకొఱకు మహాపర్వతభారమునైన వహించుటకు సిద్ధపడి తన్నడ్డగించుచున్న గంధర్వులనందఱఁ బాఱఁదోలి సంజీవిపర్వతమును బెకలించి నెత్తిపైఁబెట్టుకొని యాకాశమార్గమున సూర్యోదయము కాకుండఁ దీసికొనివచ్చి లక్ష్మణకుమారునకుఁ బ్రాణదాతయై కృతకృత్యుండయ్యెను.

జగత్ప్రాణనందనుండగు నీహనుమంతుని నిరుపమాన సహాయముచే శ్రీరామచంద్రమూర్తికి మఱువరానిమహోపకారములు జరిగెను. లక్ష్మణకుమారుఁడు జీవించుటచే రామునకు మరల ద్విగుణితోత్సాహము కలిగెను. ఆయుత్సాహావేశమువలననే త్రిలోకకంటకుండగు దశకంఠుఁడు సపరివారముగ నిహతుఁడై పోయెను. ముల్లోకములయందు శాంతి నెలకొనియెను. విజయోత్సాహుండగు రఘువీరుం డప్పుడు విభీషణునకు లంకారాజ్యపట్టాభిషేకముచేసి హనుమత్సీతాలక్ష్మణసహితుండై సుగ్రీవాదివీరులతో ససైన్యముగఁ బుష్పకారూఢుండై

కదలి యయోధ్యానగరంబున సుఖముగాఁ బ్రవేశించెను.

పరమభక్తాగ్రగణ్యుండగు పావని శ్రీరామచంద్రుని ప్రభువుగను, బాంధవునిగను, భగవానునిగను, భావించుచు, భయభక్తితాత్పర్యములతో నిరంతరమును సేవించుచుండెను. శ్రీరామనామకీర్తనతత్పరుండగు నాతని కంతరంగమును బహిరంగమునుగూడ రామమయమైయుండెను. శ్రీరామపాదసేవనమే యాతనిజీవనమైయుండెను. శ్రీరామచంద్రుఁడుగూడనతి వాత్సల్యముతో హనుమంతు నాదరించుచుండెను; అతివిశ్వాసముతో గౌరవించుచుండెను; అత్యుత్సాహముతోనభినందించుచుండెను. అతనికి హనుమంతుఁడొక్కఁడే సర్వాంగరక్షకుఁడును, సర్వకాలసన్నిహితుండును, సర్వప్రధానుండును, సర్వస్వమునై యుండెను. అందుచేతనే, రామునివంటిరాజును, పావనివంటిబంటును లేఁడని ప్రఖ్యాతఁబయ్యెను. దాశరథివంటిదైవతమును, పవనతనయునివంటిభక్తుఁడు గూడ లేఁడని చెప్పినను చెప్పవచ్చును.

శ్రీరామపట్టాభిషేకానంతరమున జగత్పితరులగు సీతారాములు పరమభక్తుండగు పవననందనుండు తత్త్వదర్శనంబునకుఁ దగినయధికారియని నిశ్చయించి యనుగ్రహంబుచేసి సవిస్తరంబుగా సప్రమాణంబుగా బ్రహ్మతత్త్వోపదేశంబుఁగావించి నిరపేక్షితసత్కర్ముండగు నాతనిధన్యజీవితమును సార్థకముగాఁజేసి చిరంజీవి వగుమనియాశీర్వదించి యాతనికిఁ గల్పాంతంబున బ్రహ్మపదంబు లభించునట్టివరంబును బ్రసాదించిరి.



# చిరంజీవులు.



## ౨ విభీషణుఁడు.



భవ్యతపమున దేవభా ♦ వంబుఁ గాంచి
శఠుల నన్నల విడిచి దా ♦ శరథిఁ గొలిచి
దైత్యకులభూషణుండయి ♦ తనరినట్టి
సాధుమూర్తి విభీషణు ♦ సంస్మరింతు.

మహాత్ముఁ డగునివ్విభీషణుఁడు కైకసీవిశ్రవసుబ్రహ్మర్షులకు మూఁడవతనయుఁడు. దురాత్ములగు రావణకుంభకర్ణులీతని కగ్రజులు. పంకము నుండిపద్మముదయించినట్లు, రాళ్ళలో నుండి రత్నముపుట్టినట్లు, దుష్టరాక్షసకులమునందుఁబరమ భాగవతోత్తముఁడగు నీతఁడు జనియించెను. పుట్టినప్పటినుండియు నీతఁడు పరమశాంతస్వభావుఁడై కన్నవారికిని గనుఁగొన్నవారికిని గూడఁ బరమాహ్లాదముంగూర్చుచు సద్గుణములతోఁబాటు వర్ధిల్లుచుండెను.

ఈతనిభ్రాతలగు రావణకుంభకర్ణులు మొదటినుండియుఁ గ్రూరమార్గప్రవర్తకులై విజృంభించితపోవనంబులఁ బ్రవేశించి మహామునుల సత్కర్మంబులకు విఘ్నములఁగల్పించుచు నిర్దయు

లై వారి ననేకవిధముల బాధలఁ బెట్టుచుండెడివారు. అట్టిసమయములయందుఁ బరమదయాళుండును, పాపభీరుండును, బరదుఃఖదుఃఖితుండునునగువిభీషణుండు దనయన్నల ననేకవిధముల బ్రతిమాలి యాదారుణకృత్యములనుండి వారిని మరలించితపోధనులను క్షమింపఁ బ్రార్థించి యాపద్విముక్తులగువారివలన శుభాశీర్వాదంబుల నందుచుండెడివాఁడు.

విభీషణుండు చిన్నతనమునుండియు బ్రహ్మవంశోచితంబులగు సత్కర్మంబులను బ్రతిదినంబును విధివిధానంబుననిర్వర్తించుచు నియమపరుండై తండ్రియగు విశ్రవసుబ్రహ్మయొద్ద వేదాభ్యాసము సేయుచు వేదార్థముల నతిశ్రద్ధాన్వితుండై యడిగి తెలిసికొనుచుఁ బరతత్వమునుగూర్చి యాలోచించుకొనుచుఁ దన్మయుఁడై యానందబాష్పంబుల విడుచుచు నన్నలవలె నెన్నఁడును గలనైనఁ బరహింసాపరాయణుండుగాక కరుణార్ద్రహృదయుండై. ప్రశాంతచిత్తముతోఁ గాలక్షేపముసేయుచుండెను. ఆకాలమునం దాతనికిఁ బ్రతిదినమును బ్రధానకృత్యములు రెండేయైయుండెను. తనయగ్రజులచే నతిదారుణముగ బాధితులగుచున్న తపోధనుల యపాయనివారణమున కుపాయ మాలోచించుటయొకటి; సర్వజ్ఞుఁడగుజనకునివలన సకలధర్మశాస్త్రములను గ్రహించి నియతవ్రతుండై స్వధర్మాచరణంబుఁగావించుట మఱియొకటి; విభీషణునిబాల్యమంతయు నీవిధముగ జరిగెను.

ఇట్లుండ విధివశంబున దుర్మదాంధులగు రావణకుంభకర్ణులు విశ్వవిజయాపేక్షులై బలసాధనంబుకొఱకు గోకర్ణక్షేత్రంబునకుంబోయి యచ్చటఁ బరమేష్ఠింగూర్చి యనన్యసాధ్యంబును, నతికఠోరంబును నగుతపంబుసేయ నారంభించిరి. సాధుశీలుండగువిభీషణుండును నాత్మమంగళాకాంక్షియై తపశ్చరణాభిలాషచే గోకర్ణంబునకుఁబోయి భ్రాతలయాశ్రమంబుల కనతిదూరంబున నొకయాశ్రమంబుఁగల్పించుకొని, నియతచిత్తుండై ప్రాణాయామంబుచేసినిర్మలహృదయకమలపీఠంబునఁబద్మసంభవునినెలకొల్పి నిశ్చలభక్తియుక్తుండై యేకపాదంబుననిలిచి,నిరాహారియై పెక్కేండ్లు తపంబుఁ గావించెను.అనంతర మున్మీలితనయనుండై తదేకదృష్టితో నాదిత్యమండలము నవలోకించుచు నూర్ధ్వబాహుఁడై విశుద్ధచిత్తంబున శ్రుతిసంకీర్తనంబుఁ జేసికొనుచుఁ గొంతకాలము మహాతపముఁగావించెను.

పరమశాంతుఁడగు నాతనితపఃప్రభావముచేఁ దపోవనమంతయు శాంతినిదానంబయ్యెను. అందుచే నచ్చటిసకలజీవసముదాయంబును తమతమజాతివైరంబులనువీడి పరమానందంబునఁ బరస్పరసహాయంబులు చేసికొనుచు మిత్రభావంబున మెలంగుచుండెను. మఱియుసాధువిహంగములు నిర్భయముగా విభీషణునికంఠమునుండి వ్రేలాడుచున్నరుద్రాక్షమాలికలపై వ్రాలి బ్రహ్మానందపారవశ్యముచే నాతనికన్నులనుండి వెలువడుచున్న ప్రేమాశ్రుధారల నాప్యాయనంబుగ నాస్వాదించి

తృష్ణానివృత్తిఁగావించుకొని యానందగీతముల గానము సేయు చుండెను.

ఇట్లు పరమనిష్ఠాగరిష్ఠుండై విభీషణుండు గావించుచున్న మహాతపంబునకు సంతుష్టుండై భక్తవత్సలుండగుపంకజాసనుం డాతనికి సాక్షాత్కరించి కరుణాకటాక్షవీక్షణంబుల నాతనిపైఁబరగించుచు "వత్సా!విభీషణా! యోగరంజితమతివై నీవాచరించు తపంబునకుఁ బ్రహృష్టహృదయుండ నైతిని. అపారంబగు నీభూతదయాపరత్వమును, ననుపమానమగు నీధర్మబుద్ధియుఁ బ్రశంసనీయంబులు. ఈజగంబునందలి తపోధనులలో నీకు సముండగువాఁ డెవ్వఁడును లేఁడు. నీనిశ్చలారాధనంబునకు మెచ్చితిని. నీయభిమతార్థంబుఁ దీర్పుటకై వచ్చితిని. ఏమికావలయునో కోరికొను"మనియనుగ్రహించెను.

అప్పుడు విభీషణుఁడు పరమేశ్వరసాక్షాత్కారముచేఁ బరమానందపులకితాంగుండై చేతులుజోడించుకొని "స్వామీ! కమలాసనా! తేజఃకిరణంబులచే సూర్యుండును, శాంతకళలచేఁ జంద్రుఁడును, పావనజ్వాలలచేఁ బావకుండును, వన్నెఁగాంచి నవిధంబున సకలసద్గుణంబులచే సంస్తవనీయుండవై సర్వజగంబులను సృష్టించుటకుఁ గర్తవైనసర్వేశ్వరుండవగు నీవునాతపంబునకు మెచ్చి పరమానుగ్రహంబున నాకు సాక్షాత్కరించితివి. నాజీవితము ధన్యమైనది. నేనుకృతకృత్యుండనైతిని. ఇదియే నాకుఁ బదివేలు. ఇంతకంటెను నాకపేక్షణీయం బేము

న్నది? అయినను నమోఘదర్శనుండవగుని విట్లనుగ్రహించి వరప్రార్థనంబు గావింపుమని యానతిచ్చినప్పు డుదాసీనుండనై యుండుట భావ్యంబుకాదు. మహాత్మా! నీకు నాపై వాత్సల్యము గలదేని నన్నెన్నఁడును దుస్సహంబులగు నాపదలు పొరయకుండునట్లును, నాచిత్తము నిరంతరమును దిగ్లోకపూజ్యంబగుధర్మమార్గమునే యనుసరించుచుండునట్లును నుపదిష్టంబుగాకుండఁగనే యిచ్చవచ్చినప్పు డనివార్యంబగు బ్రహ్మాస్త్రంబు నాకు వశంబగునట్లును వరంబులు దయసేయుము. మఱియునా యాశ్రితధర్మంబుల కనుకూలంబుగ నాచిత్తవృత్తి యుండున ట్లనుగ్రహింపుము." అని ప్రార్థించెను.

లోకపితామహుండగువిధాత యాతనిసాధుస్వభావంబునకుఁ బరమానందభరితుండై యభీష్టవరప్రదానంబుఁ గావించి "విభీషణా! నీవు రాక్షసవంశంబున జన్మించియుఁ గ్రూరవృత్తి నుండైనను లేకుండ సౌమ్యగుణవిరాజితుండవై యొప్పుచున్నాఁడవు. దేవతలుగూడ నీసమానులుగాఁజాలరు. భక్తిభావపూరితంబులగునీపవిత్రవచనంబులు నన్నుఁ బరమానందంబునఁ దేల్చినవి. వత్సా! నీకు, అమరత్వమును, చిరంజీవత్వమును, అకుంఠితసౌశీల్యమును బ్రసాదించితిని. నీవింతటినుండి దేవదానవమానవాదులయం దుత్తమోత్తముఁడవై స్తవనీయచరిత్రుఁడవై మెలంగెదవుగాక!" అని యనుగ్రహించి యంతర్ధానుండయ్యెను. ఆసమయంబున నంతరిక్షమునుండి పుష్పవృష్టి గురిసెను, దేవదుందుభులు మొరసెను.

అదిమొదలు విభీషణుఁడు, పరమేశ్వరుఁడు సత్త్వరూపుఁడనియుఁ దద్భావమే సత్యమనియుఁ దత్కళయే శాంతమనియు దద్గుణమే సౌమ్యతయనియుఁ దదంగమే ధర్మమనియు నట్టి ధర్మము నాశ్రయించినగుణవిశిష్టులే మాననీయు లనియుఁ దద్వ్యతిరిక్తులగువారు కామక్రోధాదులకువశులై యధోగతులగుచుందు రనియు, వారి నీడ ననుసరించియే సకలవిపద్వ్రాతంబులును సంచరించుచుండుననియు నీవిధముగా ధర్మాధర్మవిచారణముచేసి తత్త్వమును గ్రహించుచు భగవద్భక్తుఁడై మెలంగుచుండెను.

ఇట్లు విభీషణుఁడు ప్రశాంతభావంబున మెలంగుచుండ రావణుఁడు దుర్మదాంధుఁడై దేవగంధర్వాదులను, మానులను, మానవులను బరిభవించుచుఁ బరధనపరదారాపహారియై, నిరంతరమును దుష్కృత్యములచేతనే కాలక్షేపము సేయుచుఁ ద్రిలోకంబులయందునుఁ దన కెదు రెవ్వరును లేమింజేసి విశృంఖలుఁడై సంచరింపఁదొడంగెను. తనయగ్రజుం డిట్లు పాపాత్ముండై తల్లిదండ్రులకును వంశంబునకును నపకీర్తి తెచ్చుచుండుటంగాంచి సహింపఁజాలక యాతనికి నేకధర్మముల బోధించి యాయాసమయములయందు హితోపదేశంబు చేయుచుండెడివాఁడు. కాని, యాతనిమాట లెప్పుడును రావణుఁడు లక్ష్యముసేయలేదు. ఒకప్పుడు రావణుఁడు తనసోదరియగు శూర్పణఖ పరాభవమును దీర్చుటకని సెపముపెట్టు

కొని శ్రీరామునియెడల మత్సరించి కామాతురుండై కపటో పాయంబున సీతాదేవినపహరించి తనరాజధానికిఁగొని తెచ్చెను. మహాపతివ్రతాశిరోమణియగు నామెను నాతఁడనేకవిధముల బాధింపఁదొడంగెను. మహావీరశిరోమణియగు శ్రీరామచంద్రుఁడీవృత్తాంతమంతయుఁ దెలిసికొని సుగ్రీవసాహాయ్యంబున జగంబంతయుఁ గంపింపఁజేయునంతటి మహాసైన్యముతో సముద్రమునుదాఁటివచ్చిలంకానగరమును ముట్టడించి పుత్త్రమిత్త్రకళత్రాదులతో రావణుని సంహరించి సహధర్మిణియగు సీత నుద్ధరించుటకుఁ బూనుకొనియుండెను.

అతిదారుణంబగు నట్టివిపత్సమయంబున దూరదర్శియు ధర్మాత్ముండునగు విభీషణుండు చింతాకులితచిత్తుండై యన్నయగు దశకంఠునిచెంతకుఁబోయి వినయవినమితుండై హితమధురగంభీరవచనంబులతో "సోదరా! అసురకులపరిపాలకుండవును, దనుజరాజ్య సంస్థాపకుండవును నగునీవి ట్లధర్మమార్గమునఁ జరించుచు నపకీర్తిపాలగుటయేకాక, యాత్మవినాశంబుఁ గల్పించుకొనుట పాడిగాదు. శ్రీరామచంద్రుఁ డసురసంహారకార్థమై యవతరించిన యాదినారాయణుఁడుగాని కేవలమానవమాత్రుఁడుగాఁడు. నీవు నిస్సంశయముగ నపహరించి తెచ్చి చెఱఁబెట్టిన సీతాదేవి నిశ్చయముగా లోకమాతయగునాదిలక్ష్మీదేవిగాని, కేవలమానవకాంతగాదని నమ్ముము. ఆరాముఁడు కోట్లకొలఁది పరాక్రమధనులగు కపిభల్లుకవీరులతోఁ

గలసి నీపైఁ దండెత్తి వచ్చియున్నాఁడు. ఆతని నాశ్రయించియున్న యోధులు సామాన్యులుగారు. మొన్న నొకకపివీరుఁడు సముద్రము లంఘించివచ్చి నిర్భయముగా నీకు బుద్ధిసెప్పి యీలంకానగరమంతయును ధ్వంసముచేసిపోయెనుగదా! ఆతనితో సమానులును నధికులునుగూడ ననేకవీర యోధులా సేనయందున్నారు. బలాబలముల మాట యటుండనిమ్ము. విజయమనునది యెప్పుడును ధర్మపక్షమునం దుండునుగాని యధర్మపక్షమునం దుండదు. నీవు శ్రీరామచంద్రుని యెడలఁ గావించినది కేవల మధర్మమని సకలధర్మార్థవేదివగు నీకు వేఱుగఁ జెప్పనక్కఱలేదు. అసురసార్వభౌమా! నీవు నీరాజ్యమును, బ్రజలను,కులమును, కుటుంబమును, విపత్తులపాలైపోకుండనిలుపుకొనఁదలంతువేని నాప్రార్థనమును మన్నించి యిప్పుడైనను జానకీదేవిని గొనిపోయి సవితృకులతిలకుండగు రఘువీరున కర్పించి శరణంబు వేఁడికొనుము. అట్లు చేయకుంటివేని దానవకులంబంతయు నీమూలమున నిర్మూలమై పోఁగలదు. ఇంతయపచారముఁ గావించిననే నేమొగముఁబెట్టుకొని రామచంద్రుని దర్శింపఁగలనని శంకింపవలదు. అతఁడు శరణాగతరక్షకుఁడు; శాంతమూర్తి; కరుణామయుఁడు;ఉదారహృదయుఁడు. కాఁబట్టి యవతారమూర్తియగు నాతనిఁ శరణుఁజొచ్చుటకుఁ ద్వరపడుము. ఈయుచితసమయమును వ్యర్థముచేసి పిదపఁ జింతించుటవలనఁ బ్రయోజన మేమియును లేదు.”అనియనేకవిధముల బోధించెను.

కఠినచిత్తుండును దృఢనిశ్చయుండును స్వతంత్రుండును సత్త్వగుణవిహీనుండు నగు రావణునకు సాధుశీలుండగు విభీషణునిమాటలు తలకెక్కునా? అప్పుడాతఁడు, తోఁక ద్రొక్కిన త్రాచువలె నెగసిపడి క్రోధోద్రేకంబునఁ గన్నులనుండి యగ్నిస్ఫులింగములు వెలువడుచుండఁ దమ్ముని గాంచి "ఛీ! దురాత్మా! ఏమేమో పెద్దవలెఁ దగుదునని, యగ్రజుఁడు పూజ్యుఁడు ననితలంపక నాకు నీతులు గఱపవచ్చితివా? త్రిభువనేశ్వరుండనగు నా పెంపుఁ దలంపనైనఁదలంపక యొక మానవమాత్రుని దైవసమానుఁడని బట్టువలెఁ బొగడుటకు నీనోరెట్లాడినది? నా వైభవమంతయు నీకన్నులఁ గుట్టుచున్నది కాఁబోలును. "జ్ఞాతిశ్ఛేదనలేనకిమ్" అనుమాట నీయెడల నిదర్శనముగ నగపడుచున్నది. జగదేకవీరుండనగు నేనొక సామాన్యమానవుని శరణంబు వేఁడుకొనుచుండఁగా నీకుఁ గన్నారఁ జూచి సంతసింపవలె ననియున్నదా? ఛీ! ఇఁక నీ మొగముచూడఁగూడదు." అని తనవామపాదముచే విభీషణునిఁ దన్ని గెంటివైచుచు "కృతఘ్నా! పిఱికిపందా! నీవీక్షణమునందే నా రాజ్యమును విడిచి పొమ్ము." అని యతిదారుణముగ శాసించెను.

నిండోలగంబునఁ గలిగిన యాదారుణపరాభవమునకు విభీషణుఁడు సహింపఁజాలకపోయెను. అప్పు డాతని కాకస్మికముగా నాగ్రహమును దుఃఖమునుగలిగినవిగాని సత్త్వగుణప్రి

ధానుండగు నాతఁడంతలోనే మనసు పదిలపఱచుకొనియెను. అన్నతమ్ముఁ డన్నెనువిచారముకంటె నిష్కారణముగ దనుజ వంశక్షయమున కాతఁడు కారకుఁడయ్యెఁగదా యనువిచారమే విభీషణునిహృదయమును గలఁచివైవఁదొడంగెను. అట్టి వికల హృదయముతో నాతఁ డాక్షణమునందే సభవిడిచి యడుగులు తడఁబడుచుండ సకలాంగకములును గంపించిపోవుచుండ నంతః పురంబునకుఁబోయి జననియగు కైకసిని దర్శించి, నమస్కరించి సర్వవృత్తాంతము నామెకెఱింగించి, "అమ్మా! నేనిఁక నీన గరమునందుండఁజాలను. ఏయరణ్యంబులకైనను బోయి తపంబు చేసికొనుచు శాంతముగఁ గాలక్షేపము సేయఁదలంచితిని. ఈ దారుణకృత్యములఁ గాంచుచు నీనగరమునం దుండుటకంటె నరణ్యావాసమే సుఖకరమైనదని తోఁచుచున్నది. తల్లీ! నాకిఁక సెలవిమ్ము." అనియెను.

ఆమాటలాలకించి తల్లియగు కైకసి కన్నుల నీరునించుచు "బిడ్డా! ఇందుకొఱకు నీవేమియును విచారింపకుము. విధి విధాన మవిలంఘ్యమైనది. మీయన్నలగు రావణకుంభకర్ణు లిరువురును రాక్షసకులనాశకులనియు, వారిమూలమునఁ ద్రిభు వనంబులకును జేటగుననియు నీవే సుగుణమూర్తివనియు నీవ లననే దానవవంశము సుస్థిరముగా నిలిచి సుప్రసిద్ధకీర్తిగాంచు ననియు నీజనకులును నీపితామహుఁడగు పులస్త్యుఁడును నిదివ ఱకే చెప్పియున్నారు. జరుగవలసినదెట్లును జరుగకమానదని

నేనిక నావిచారమంతయును వదలుకొనియున్నాను. త్రికాల వేదులగు నీపితృపితామహులు చెప్పినవాక్య మెప్పటికి నసత్యము కాదు. నీవుగాదు బ్రహ్మాదులు వచ్చి బోధించినను వారు వినువారుగారు. వారిదుష్కర్మము వారి నాత్రోవ కీడ్చుకొని పోవుచున్నది. నీవు మాత్ర మేమిచేయఁగలవు? నిన్నుఁగూడఁ దమతోఁజేరి పనిచేయవలయునని నిర్బంధింపక యీవిధముగాఁ ద్యజించివైచుట మేలే యనితలంపుము. నీవిప్పుడే పోయి శ్రీరామచంద్రమూర్తిని శరణంబువేఁడి యాతనిసేవించుచు జీవింపుము. ఆతఁడు కేవలముఁ బరాత్పరుఁడుగాని మానవమాత్రుఁడుగాఁడు. సహోదరుల కపకార మగునేమోయని సంశయింపకుము. పొమ్ము." అని యాశీర్వదించి సెలవొసంగెను.

విభీషణుండును మాతృవాక్యమును శిరసావహించి పూర్వాపరంబులు విచారించుకొని కార్యనిశ్చయంబుఁ గావించుకొని లంకానగరమునందును రావణకుంభకర్ణులయందును రాక్షసకులంబునందును గలమమకారమును ద్యజించి గగనమార్గంబునఁ బోయి వానరసేనామధ్యంబునందున్న శ్రీరామచంద్రుని చరణకమలములయందుఁబడితనయన్వయనామగోత్రంబులు దెలుపుకొని శరణంబు వేఁడికొనియెను. ఆశ్రితజనశరణ్యుండగు రఘువీరుండాతని కభయప్రదానంబుఁగావించెను. ఈతఁడుశత్రు

పక్షములోనివాఁడనియు, రావణునకు సహోదరుఁడనియు రాక్షసుండుగావున విశ్వసనీయుండుగాఁడనియుఁ గొందఱు వానరవీరులు తమవ్యతిరేకాభిప్రాయములను శ్రీరామచంద్రునకు విన్నవించిరి. కాని, సర్వవృత్తాంతము నెఱింగియున్న హనుమంతుఁడు వారివారిసంశయముల నివారించి విభీషణుని యోగ్యతనుగూర్చి రామునకు విన్నవించెను. రాఘవుండప్పుడు విభీషణునిఁ దనయాత్మీయునిగా నంగీకరించి లంకారాజ్యమునకుఁ బట్టాభిషిక్తునిఁగావించెదనని యనుగ్రహించెను.

విభీషణుండును మహాప్రసాదముగ భావించి బాంధవాభిమానమును విసర్జించి భువనమంగళంబుకొఱకు దుష్టసంహారము కావలయునని భావించి రామునియుదారస్వభావమునకు సంతోషించుచు నావశ్యకంబులగు లంకారహస్యవిషయంబుల నాతని కెడనెడ నెఱింగించుచు రామచంద్రునకు హితుండును, బంధుండును, సహాయుండును, విశ్వాసపాత్రుండునై మెలంగుచుండెను.

రావణాదిదుష్టరాక్షససంహార మయ్యెను. అప్పుడువిభీషణుఁడు సీతామహాదేవిని సగౌరవముగ సభక్తికముగఁదీసికొనివచ్చి శ్రీరామచంద్రమూర్తి కర్పించెను. విజయరాఘవుఁడుపరమానందముతో విభీషణునకుమహావైభవంబుమెఱయ లంకారాజ్యపట్టాభిషేకంబుచేసి తొల్లి దానొనరించినవాగ్దానముఁజెల్లించుకొనియెను. విభీషణుండును హతశేషులైనరాక్షసకుటుంబములకుఁ దగినయుపాధులను గల్పించి రాజ్యపరిపాలనంబుఁగావించుచు నంతటినుండి తనరాజ్యమునందు దానవులుదారుణకర్మ

ముల నాచరింపఁగూడదనియు, హింసారతులుగాక, యిష్టదైవంబుల నారాధించుకొనుచు, ధర్మమార్గంబునఁ జరించుచుండవలయుననియు శాసనముంగావించెను. లంకానగరమధ్యమున మహావైభవసమన్వితంబును, నమూల్యమణిసువర్ణఖచితంబును జిత్రవిచిత్రభూషణాలంకృతంబును,మనోహరంబును దర్శనీయంబును నగు శ్రీరామాలయమును నిర్మించి యందు శ్రీరామవిగ్రహమును బ్రతిష్ఠించి నిరంతరము నరుణోదయమునకు ముందుగ లేచి యాదివ్యమూర్తిని సందర్శించి యారాధించుచుండెను. మఱియుఁ దనయన్నవలెనే లంకానగరమునఁ బ్రతిష్ఠింపఁబడిన శివాలయంబులయందలి శివలింగములకు సద్భక్తితోఁ బూజించుచుండెను.

తరువాత విభీషణుఁడు శ్రీరామచంద్రుని పట్టాభిషేకసమయంబున కమూల్యోపాయనంబులుగైకొని యయోధ్యానగరంబునకుఁబోయి యచ్చట మహారాజచంద్రుఁడగు శ్రీరామునిచేఁ దమ్ములగుభరతాదులతో సమానమగుగౌరవముం గాంచియాయనఘునియపారకరుణాకటాక్షంబునకుఁబాత్రుండై కొన్నిళ్ళందుండి యవ్విభునియనుజ్ఞనడసి లంకానగరంబునకు విచ్చేసి మహానందంబున రాజ్యపరిపాలనంబు సేయుచు, దేవదానవమానవసంఘంబులచే సంస్తూయమానుండై స్వప్నంబునందైనను సన్మార్గంబును దప్పక సంచరించుచుఁ జిరంజీవియై పరమభక్తాగ్రేసరుండను ప్రఖ్యాతిం గాంచి సుఖంబుండెను.



# చిరంజీవులు.

## ౬ కృపాచార్యుఁడు.

గర్భనరక బాధ ♦ గానక జనియించి
ఆత్మశక్తిచేత ♦ హరుని గాంచి
దీర్ఘ జీవియైన ♦ తేజస్వికృపుని, మా
నసమునందుఁ దలఁచి ♦ నతులొనర్తు.

కృపాచార్యుఁడు శరద్వంతుఁడను మహర్షికిఁ దనయుఁడు. ఈతఁడు చిన్నతనమునుండియు భూతదయగలవాఁడు. చీమలు మొదలగు నల్పజంతువు లెండవానలతాఁకున కోర్వఁజాలక శ్రమపడుచున్నప్పుడు దయాళుఁడగునీతఁడు సాధ్యమైనంత వఱకు వాని కుపచారములుగావించుచుండెడివాఁడు. ఈతఁడెంతటిసుందరమూర్తియో యంతటికరుణామూర్తియగుటచేఁ గృపాశాలియగు నీతనిఁగాంచినవా రందఱును పేరునకుఁదగినసద్గుణములు గలవాఁడే యని మెచ్చుకొనుచుండిరి. ఈతఁడువిద్యానిధియగు తనజనకునియొద్దనే వేదవేదాంగములును, శాస్త్రములును, ధనుర్వేదమును గూడ నభ్యసించి క్రమముగా సమస్తవి

ద్యాపారంగతుఁ డయ్యెను. విద్యాభ్యాససమయంబున నీతఁడు మిగులశ్రద్ధాన్వితుఁడై తండ్రియుపదేశించిన విషయంబుల నన్నిటినిఁ దనవినిర్మలహృదయఫలకంబునముద్రింపఁజేసికొనుచు మాటిమాటికిని, వానివిశేషార్థములను మననముచేసికొనుచు విద్యాలంకారుఁడై వెలయుచుండెను.

ఆతనివిద్యాబుద్ధులును స్వరూపస్వభావములును, శక్తియుక్తులును, గాంచి కురుపితామహుఁడగు భీష్ముండు శరద్వంతుని బ్రార్థించి తదనుమతంబునఁ గృపాచార్యుని హస్తినాపురంబునకుఁ దోడ్కొనిపోయి, కురుకుమారుల కందఱకును విద్యాగురునిగాఁజేసి యాతని ననేకవిధంబుల నాదరించి పూజించుచుండెను. కృపుండును దనయసాధారణబోధనానైపుణ్యముచే నుచితపద్ధతిని గురుకుమారులకందఱకును సకలవిద్యల నుపదేశించుచు రాకుమారులగువారిని ధనుర్విద్యావిశారదులుగఁ గూడఁ గావించి ప్రభునిమన్ననకును, శిష్యులగౌరవమునకును బాత్రుండై స్వధర్మనిర్వహణమును గావించుకొనుచుండెను.

అంతఁగొన్నిదినంబులకుఁదనసహోదరీభర్తయగుద్రోణాచార్యుండు కురుకుమారులకు ధనురాచార్యుండుగా హస్తినాపురంబునకు విచ్చేయుటయుఁగృపాచార్యుండుదనకించుకవిశ్రాంతి కలిగినదని సంతోషించి భీష్మానుమతంబువడసి యాధ్యాత్మికతత్త్వచింతాపరుండై బ్రహ్మతత్త్వజ్ఞానంబును సాధించును ద్దేశముతో సాధుజనసమాకీర్ణంబగు కాశీపురంబునకుంబోయెను.

అట నొకనాఁటిసాయంకాలంబునఁ గృపాచార్యుండు గంగాతీరంబునఁ గూర్చుండి పరమపావనంబులగు భాగీరథీవిమలజలంబులలోఁ బ్రతిబింబించుచున్న ప్రశాంతకిరణుండగు ప్రభాకరునిఁ దిలకించుచుండెను. అప్పు డాతని కనతిదూరంబున నట్టిప్రభాకర తేజమే వదనమండలంబున వెల్లివిరియుచుండ సాక్షాత్కరించినశంకరునింబోలి వెలుంగుచున్నదివ్యతముఁడను సంయమీంద్రుం డాతనికి దృగ్గోచరుం డయ్యెను. తోడనే కృపాచార్యుండుపరమానందకందళితహృదయారవిందుండై యీమహాత్ముని సేవించినచో నాయభిమతార్థంబు సిద్ధింపఁగలదనిభావించి యటనుండిలేచి యాతనిసమీపంబునకుంబోయి యమ్మునీంద్రునిచరణకమలంబులకు సాష్టాంగప్రణామంబుఁ గావించెను. అప్పుడు తపోధనుండగు దివ్యతముఁడు వాత్సల్యపూర్వకంబుగ నాతని నాశీర్వదించి నీ వెవ్వరివాఁడ వేలవచ్చితివనిప్రశ్నించెను.

కృపుండప్పుడు తనకులగోత్రనామంబులఁ దెలిపికొని "మహాత్మా! నీసేవఁగావించి కృతకృత్యుండఁ గావలయునని తలంచి భవదనుగ్రహముఁగోరి వచ్చియున్నాఁడను." అనివిన్నవించుటయు, మునివరుండగుదివ్యతముం డించుక సేపు నిమీలితనేత్రుండై యాలోచించి మందస్మితవదనారవిందుండై "వత్సా! కృపాశాలివగునీవు నీకుఁదగినసదుద్యోగమునకుఁ బ్రయత్నించుచుంటివి. నీవుదుర్భరంబును, సంతాపభాజనంబును నగుగర్భనరకము ననుభవింపకయే యవతరించినపుణ్యమూర్తివి. శర

స్తంబసంఘర్షణంబున వ్యక్తంబైననీయీభౌతికమూర్తి కేవలమును దివ్యమూర్తియైయున్నది. నీవంటిపుణ్యాత్మమూర్తి శిష్యుఁడుగా లభించుటచే నేను ధన్యుఁడనైతిని. నావలనఁ దెలియందగినధర్మరహస్యంబు లేవైన నన్నచో నిస్సంశయంబుగ నడిగి తెలిసికొనవచ్చును. ఉత్తమాధికారివగు నీకుఁ దెలుపందగనిగూఢతత్త్వంబు లేవియును లేవు. "అని యనుగ్రహించి యాదరించుటయుఁ గృపుండు పెన్నిధిగన్న పేదవలె నానందతన్మయుండై "మహాత్మా! నేను నాజనకునియొద్ద సమస్తవేదవేదాంగములను సరహస్యంబులుగా నభ్యసించితిని. వానినన్నిటిని సంపూర్ణముగా నిప్పటివఱకును మననముచేసికొనుచునే యుంటిని. కాని, చదువులకును, వాక్కులకును, మనస్సునకును గూడ నందరానిదియు, సర్వమును దానయై వెలుంగుచున్నదియు, సులభంబయ్యు దుర్లభంబైనదియునగుపరమతత్త్వముం గూర్చి తెలిసికొనవలయునని చాలఁ గుతూహలపడుచున్నాఁడను. నీయనుగ్రహంబున నాయభీష్టార్థంబు సిద్ధింపఁగలదని యాసపడుచున్నాఁడను. నన్ననుగ్రహింపవలయును." అని ప్రార్థించెను.

దివ్యాత్ముం డాతనిసదభిలాషంబునకు సంతుష్టుండై "వత్సా! అడుగందగినయర్థమునడిగితివి. ఆధ్యాత్మికచింత సర్వకార్యసంఘటనమునకును బ్రధానాధారమైనది. ఆత్మసమ్మేళనము సేయనిదే యేకార్యమును సాధింపఁజాలము. సాధకుండగు

వాఁడు ముందుగ నితరకార్యతత్త్వమును సంపూర్ణముగ మఱచిపోవలయును. సాంసారికవ్యాసంగమును విస్మరింపవలయును. కష్టసుఖంబులయందుఁ దలంపులేకుండవలయును. గురూపదేశమును గ్రహించుటయందే తనమనంబును నిశ్చలంబుగ నిలువరించియుండవలయును. గురువుకూడ నిట్టి యితర వ్యాపృత్తిని మఱచి ప్రబోధింపవలయును. ఆత్మదృష్టికి గోచరముగాని దెద్దియునులేదు. నిశ్చలచిత్తముతోఁ బ్రయత్నించినచోఁ బరమేశ్వరుని సత్యస్వరూపమును గాంచఁగలరు.ఆత్మయే భగవంతుని లీల.ఆత్మశక్తిచేఁ బర్వతములను గరఁగింపవచ్చును. సముద్రములను శోషింపఁజేయవచ్చును. దారుణానలజ్వాలలను జల్లార్పవచ్చును. కాని, యగ్నికి ధూమమువలె నాత్మకుఁ బ్రకృతిసంబంధమగు మోహావికారము వ్యాపించియుండును. ఆవికారమును దొలఁగించువఱకును నాత్మకు నిర్మలత్వము గలుగనేరదు. కావున, సాధకు లీవిషయమును జ్ఞప్తియందుంచుకొని యజ్ఞాననివృత్తికై యనుక్షణమును బ్రయత్నించుచుండవలయును. అట్లుసేయకున్నచోఁ బరిపూర్ణజ్ఞానము లభింపఁజాలదు, నీవిప్పుడు ముందుగ నీయంతరంగమును వినిర్మలముగఁ జేసికొనఁ బ్రయత్నింపుము. నీమనంబెప్పుడు నిర్మలంబగునో నీవుతలంచిన సద్వస్తువప్పుడు నీకు దృగ్గోచరంబు కాఁగలదు. అదిగో నాయాశ్రమమువంకఁజూడుము. ఆయావరణమునఁ గవాటమున కెదురుగ నేమున్నదో తదేకదృష్టితోఁ

గనుంగొనుచుండుము. అనంతరము తక్కినవిషయములం గూర్చి ప్రియత్నింపవచ్చును." అని యుపదేశించెను.

తత్త్వదర్శనకుతూహలుండగు కృపాచార్యుఁడు మహాప్రసాదమని తదేకదృష్టితో మనంబు నేకీభవింపఁజేసి యొకవాటమువంక లక్ష్యముంచి ధ్యాననిమగ్నుఁడై యుండెను. ఆసమయంబున దివ్యతముండు తనచెంతనున్నబ్రహ్మదండమునుదీసి మెల్లఁగఁ గృపునియంకతలంబునం దుంచుటయు నాతఁ డులికిపడి యాదండమును జేతితో నవ్వలికిఁద్రోసివైచెను. అది చూచి గురుండు "కృపా! నీచిత్తమింకను నిశ్చలముకాలేదు. అన్యచింతలను విడిచి, యహంకారమును ద్యజించి, నిర్వికారుండవై యింకను బ్రియత్నింపుము" అని బోధించెను.

శ్రద్ధాయుక్తుండగుకృపుండు మరలలక్ష్యసాధనంబునకై ప్రియత్నముచేసెను. సాయంకాలమయ్యెను. గురుండగు దివ్యతముండు గంగాతీరమునకుంబోయి సంధ్యావందనాదికృత్యంబులు నిర్వర్తించుకొని మరలివచ్చెను. కృపుండింకను లక్ష్యసాధనంబు సేయుచునే యుండెను. క్రమముగా జామురాత్రియైనది. నాఁడు పూర్ణిమయగుటచే వెన్నెల పుచ్చపువ్వువలె జగమంతట వ్యాపించియుండెను. అంతవఱకును శిష్యుని యభ్యాసముంగాంచియానందించుచున్న దివ్యతముం డవ్వాడాతనిచిత్తమెంతనిశ్చలముగనున్నదో పరీక్షింపవలయునని తలంచి యొకరజ్జువు నాతని మెడకుఁ దగిలించెను. కాని, కృపుం డెంతమా

త్రిమును జలింపలేదు. అంతతో నూరకుండక గురుండు తన కమండలుజలంబుల నాతనిపైఁ జిలుకరించెను. క్రమముగా జలమంతయు నాతనిపైఁ గుమ్మరించెను. కృపుండు సుంతయుఁ జలింపలేదు. శీఘ్రగ్రాహణశీలుండును గుశాగ్రబుద్ధియు నగు నాకృపాచార్యుఁ డచిరకాలంబుననే తత్త్వజ్ఞానసంపన్నుఁడుగాఁ గలఁడనియు, నిట్టి ప్రియశిష్యుఁడు లభించుటచేఁ దనయుపదేశంబు సార్థకంబు గాఁగలదనియు నాముసీందుృండు పరమానందభరితుఁ డయ్యెను.

ఈవిధముగాఁ గృపుండు గురూపదేశంబు వడయుచు నియతవ్రతుండై జ్ఞానసాధనంబు సేయుచు నచిరకాలంబుననే బ్రహ్మజ్ఞానసంపన్నుండై పరమయోగిశిరోమణియయ్యెను. సర్వజ్ఞుండగు నాతనికిఁ గాలత్రయంబును గరతలామలకంబయ్యెను. అట్లు కొంతకాల మాత్రఁడు కాశీనగరమునందుండి యనంతరము గురునియనుజ్ఞంగాంచి మరల హస్తినాపురంబునకే తెంచెను.

అప్పటికప్పుడే కురుపాండవులలోనంతఃకలహములు వర్థిల్లుటయు దుర్యోధనుఁడు లాక్షాగృహదహనాదిదుష్కర్మంబులఁ గావించుటయుఁ బరమేశ్వరానుగ్రహంబునఁ బాండవులు విపద్విముక్తులై ద్రుపదరాజతనయయగు పాంచాలిం బరిణయంబై మరల రాజ్యంబునకేతెంచుటయు ధర్మజుండు రాజ

సూయయాగంబు నతివైభవంబుగ నిర్వర్తించుటయు జరిగిపోయెను.

దుర్యోధనునిదుస్తంత్రముచే మఱునాఁడు సుహృద్ద్యూతము సేయ నిశ్చయమయ్యెను. కృపాచార్యుఁడు వచ్చినతోడనే యీదారుణవార్త నాలకించి యతిత్వరితంబుగ సుయోధనుని చెంతకేఁగి యాకస్మికంబుగనేతెంచిన బాల్యగురుండగుతన్నాతఁడు కుశలప్రశ్నము సేయకున్నను గోపగించుకొనక శిష్యవాత్సల్యంబునను కురుకులమునందలి యభిమానంబునను నాతని కనేకవిధంబుల హితోపదేశంబుఁగావించెను. కాని, దురభిమానియగు దుర్యోధనున కాసద్బోధనములు చెవి కెక్కలేదు. అందుచేఁ గృపున కాకస్మికముగ విరక్తి కలిగి యచ్చటినుండి వెడలిపోయెను. కాని, చిరకాలమునుండి దృఢపడియున్న సంబంధ మంతలో నెట్లుసడలిపోఁగలదు? తనకిష్టములేక పోయినను గృపుఁడు పాండవధార్తరాష్ట్రులు జూదమాడనిశ్చయించినసభకుఁబోవుట తప్పించుకొనఁజాలక పోయెను. ఆమాయజూదమునందుఁ బాండవులు సర్వస్వము నోడిపోయిరి. అప్పుడు భీష్మద్రోణులతోఁగలసి కృపాచార్యులుగూడ దుర్యోధనున కట్టిదారుణకార్యములు తగవనియు నంతఃకలహములవలనఁ గులక్షయంబు కాఁగలదనియు నెన్నియోవిధముల బోధించెను. దుర్యోధనుఁడు వానిని లక్ష్యపెట్టక నిండుసభలో ద్రౌపదిని పరాభవించుచుండఁ గృపామయుండగు కృపుఁ డాదుష్కర్మమును

గనుంగొనఁజాలక, దుష్టబుద్ధులగు దుర్యోధన దుశ్శాసనులను వారింపఁజాలక, విరక్తుఁడై సభనుండి వెడలిపోయెను.

పాండవులకును గౌరవులకును గూడ నెవ్వరెన్ని విధములఁ బ్రయత్నించినను, విధివశంబున మహారణము తప్పినది కాదు. మొదటినుండియు రాజోద్యోగియై యుండుటచేతను, అప్పుడప్పుడు తాత్కాలికముగ యుధిష్ఠిరుఁడు రాజై యున్నను, ధృతరాష్ట్రుఁడే హస్తినానగరరాజ్యమునకంతకును బ్రభుండై యుండుటచేతను, నాతనితనయులగు దుర్యోధనాదులే రాజ్యమునకుఁ బ్రధానాధీశ్వరులై యుండుటచేతను, బావయగు ద్రోణాచార్యుఁడును, మేనల్లుఁడగునశ్వత్థామయు ధర్మాధర్మపక్షభేదమును విడిచి స్వధర్మములు నిర్వర్తించుకొనుటకై నామమాత్రముగ గౌరవపక్షమునఁ జేరియుండుటచేతను, దానుగూడ నాపక్షము నందేయుండి యుద్ధముచేయవలసినవాఁ డయ్యెను.

కాని, నిర్లిప్తుండగు మనకృపాచార్యుఁ డామహారణంబునఁ గావించినప్రధానకార్యం బేదియును లేదు. తన్నెదిరించిన వారితోఁ బోరాడుటకంటెఁ దానెవ్వరినెదిరించి యుద్ధముసేయ లేదు. యుద్ధమంతయు ముగిసినవెనుకఁగూడ నశ్వత్థామ దురాగ్రహవశంబున నప్పటికి సగముసచ్చిపడియున్న దుర్యోధనుని మాటవిని యధర్మమునకు వెనుదీయక యర్ధరాత్రివేళఁ బాండవశిబిరంబులపైఁబడి నిదురించుచున్న యోధులయెడ నకారణకరణంబుఁ బూనికొనియున్నప్పు డాతని కనేకవిధంబుల బోధిం

చి క్రూరకర్మంబునుండి యాతని నివారింపఁజూచెను. కాని, ప్రయోజనము లేకపోయెను.

ఈమహాత్ముఁడు మొదటినుండియు మహారాజుసంబంధముగలవాఁ డయ్యును,నిర్లిప్తుండై నిష్కామకర్ముండై తామరాకునందలిజలంబునుంబోలి యేవిషయంబులయందును దగులువడక నిస్సంగునింబోలి, కాలక్షేపముం గావించెను. ఈతఁడు మహావీరుఁడయ్యును,బరమశాంతుఁడు; ప్రజ్ఞానిధియయ్యును, వినయవర్తుఁడు; భవబంధితుండయ్యును, బరమయోగిశిఖామణి; బ్రహ్మజ్ఞానసంపన్నుండగునీతఁడు పవిత్రక్షేత్రంబగువారాణసీనగరంబునఁ బరమేశ్వరారాధనంబుఁ గావించుకొనుచు నప్పటికి నిప్పటికి నెప్పటికినిగూడఁ జిరంజీవియైయున్నాఁడు.



# చిరంజీవులు.*

## ౨. పరశురాముఁడు.

జనకు నాజ్ఞదీర్చి ♦ జనయిత్రి బ్రదికించి
యవనిభరముమాన్చి ♦ యశముఁగాంచి
తామసంబుఁబూనఁ ♦ దగదని బోధించి
నట్టి పరశురాము ♦ నాత్మఁదలఁతు.

కన్యాకుబ్జమునకుఁ బ్రభుండగు గాధిరాజునకు సత్యవతి యను రూపవతియగు నొకతనయ గలిగెను. మహర్షియగు నౌర్వునితనయుండు రుచికుం డనువాఁ డాకన్యకామణినిఁ బ్రేమించి యొకప్పుడు గాధిరాజును సందర్శించి నీతనయను నాకిచ్చి పరిణయంబుఁ గావింపుమని ప్రార్థించెను.

అసమానసౌందర్యముచేతను, సుగుణంబులచేతను, విమలజ్ఞానముచేతను, బరమధర్మనిష్ఠచేతను బ్రసిద్ధుండగు రుచికుండు రాజపుత్త్రికిఁ దగినవరుఁడే. కాని యాతఁడు పరమదరిద్రుఁడు. రెండుపూటలును గడుపునిండించుకొనుట కాతనికిఁ దగినయాధారమేమియును లేదు. అట్టి పేదబాపనికిఁ దనపుత్త్రిక నొసంగుట మహారాజున కెంతమాత్రము నిష్టము లేక

పోయెను. రుచికుఁడు నిరాశచేఁ గేవలము నింటికి మరలిపోవల సినవాఁడయ్యెను.

అప్పుడు మహారాజు తనలో "ఇంతటి మహాపురుషుని ప్రార్థనమును దిరస్కరించి యూరకపంపివైచుట యెట్లు? ఈ యకార్యంబువలన లోకులు నన్ను నిందింపకుందురా? మఱియు నీతఁడు విరక్తుండైనచో నేమివాటిల్లునో యెవ్వరు చెప్పఁగ లరు? స్పష్టముగా నాతనయ నీకీయనని చెప్పక యేదోయొక విధముగఁ బులిమిపుచ్చి యాతనిఁ బంపివేయుట శ్రేయము." అని భావించుకొని, రుచికునింగాంచి "ఆర్యా! మావంశము నందుఁ గన్యకలకుఁ బరిణయంబు గావించునట్టిన వరులయొద్ద నుండి స్త్రీధనంబుగాఁ బణంబునుగ్రహించుట యాచారమై యున్నది. నీవు నాపుత్త్రికను బెండ్లియాడఁ దలంచినచోఁ బణంబు నొసంగవలసియుండును. నీవందుల కంగీకరింపఁగల వా?" అని ప్రశ్నించెను.

రుచికుండామాటవిని యెట్టిపణంబు నొసంగవలయునో యెఱింగించినచో దానిని సంపాదించి యిచ్చుటకై ప్రయత్నిం చిచూచెద ననియెను. మహారాజించుకసేపాలోచించి "ముని కుమారా! శరీరమంతయుఁ దెలుపును, గర్ణాంతరంబునం దెఱు పును, ఒకచెవి నలుపునుగల వేగవంతములగు వేయిగుఱ్ఱము లను, నాకుమారియగు సత్యవతికిఁ బణంబుగా నొసంగవల యును. అట్లు నీవీయఁగలవేని, ఆమెను నీకిచ్చి పెండ్లిసేయఁ గలవాఁడను." అనిచెప్పెను.

అట్టి యుత్తమాశ్వములు విక్రయస్థానములయందు లభించుట కెట్టి యవకాశమునులేదు. ఒకవేళలభించినను, మునికుమారుఁడు వానికిఁ దగినమూల్య మెచ్చటినుండి తెచ్చి యీయఁగలఁడు? రాజదియంతయును బాగుగ నాలోచించియే యతినిపుణముగ నిట్లు సమాధానముచెప్పి తన తలపై బరువు దింపుకొనియెను. కాని రుచికుఁడు మాత్ర మతిసులభోపాయముచే నట్టిమహాపణమును సంపాదింపఁగలిగెను. ధనము కొఱకుఁ దల్లడపడుటఁగాని, విక్రయస్థానముల వెంటఁ బరిభ్రమించుట గాని, యాతని కావశ్యకము లేకపోయెను. ఆతఁడు తత్క్షణమె వరుణదేవునిచెంతకుంబోయి, అట్టిపోలికగల వేయిగుఱ్ఱములను దనకిమ్మని కోరెను. అప్పుడు వరుణదేవుండు సంప్రీతచిత్తుండై యట్టి యుత్తమాశ్వసహస్రంబు నాతనికిఁ బ్రసాదించుటయే కాక, వానిని వెంటఁబెట్టుకొని పోవు శ్రమకూడ మునికుమారునకుఁ గలుగకుండఁ జేయఁదలంచి "అయ్యా! నీవు నిశ్చింతుఁడవై స్వదేశంబునకుంబొమ్ము. నీవెచ్చటఁ దలఁచుకొన్న నచ్చట నివి నీకు లభింపఁగలవు." అని యనుగ్రహించెను.

అప్పుడు రుచికునకుఁగలయానందమునకుఁ బారము లేదు. పరమేశ్వరసంకీర్తనముం జేసికొనుచు మరల నాతఁడు కన్యాకుబ్జమునకువచ్చి గంగాతీరమున నిలిచి తలఁచినంత మాత్రముననే భాగీరథీగర్భమునుండి వెడలియయ్యుత్తమాశ్వంబులు హేషారవంబులచే దిగంతములు మారుమ్రోఁగుచుండ

కృత్యముచేసికొనుచు నాతనియొద్దఁ జేరుకొనియెను. మునితన యుండవ్వ డాయుశ్వసహాస్రింబును వెంటఁబెట్టుకొని మంద హాసవదనముతో గాధిమహారాజు చెంతకుఁ బోయి యాతని దర్శించెను. అట్టి రుచికుంగాంచినంతనే మహారాజునకు నోట మాటలేకుండఁబోయెను. ఇఁక నేవిధముచేతను నాతనిఁ దప్పిం చుకొననేరక యాతండొకశుభముహూర్తంబునఁ దనతనయు నమ్మునికుమారున కొసంగి వివాహంబుఁ గావించెను.

రాజనందినియగు సత్యవతి రుచికు నీవలకే ప్రేమించి యుండెను. వివాహమైనపిమ్మట నాప్రేమమయదంపతులకు దినము లతిసుకరంబులుగఁ గడచిపోవుచుండెను. కాని, సత్య వతికి సంతానము కలుగలేదు. ఆమెతల్లికిఁగూడఁ బుత్రసంతా నములేకుండెను. ఆయిరువురకు నిరువురుపుత్త్రులుకలుగవలయు నని ప్రజలందఱును గోరుకొనుచుండిరి. అప్పుడు మహా ప్రభావసంపన్నుండగు రుచికుండు తనతపోమహిమచే నగ్ని హోత్రింబునఁ బాయసంబుఁ గల్పించి రెండుదొన్నెల యందుంచి వేఱువేఱుగ నభిమంత్రించి వానినిఁ దన భార్య కిచ్చి "ఇందొకటి నీవును, వేఱొకటి నీజననియుఁ బరిగ్రహింపుఁ"డని యాదేశించెను. సత్యవతి వానింగైకొని తల్లియొద్దకుఁ బోయెను. తల్లి యామెను బుజ్జగించి "అమ్మా! నీవు నీభర్తకంటెను నన్నధికముగ గౌరవించుచున్నావు. కావున నీవిప్పుడు నేఁజెప్పినట్లు కావించుట యుచితము. నీభర్తనీ

కోసంగినపాయసము నాదానికంటె మంచిదనిభావించుచున్నా ను. నీపాయసమును నాకిచ్చి నాభాగమును నీవారగింపవల యును." అనికోరెను. తల్లియట్లభిలషించినప్పుడు తనయ యేమనఁగలదు? అట్లేకావించెను.

త్రికాలజ్ఞుఁడగురుచికుఁడీవిషయమునుగ్రహించి,విచారించి సత్యవతింగాంచి "ప్రియా! నీవు చేసినపని మంచిదికాదు. నీజనని మహారాజ్ఞి.నీవుతపస్వినివి. ఆమెకు వీరుండగు తేజస్వియు నీకు ధార్మికుండగుతపస్వియుఁ గలుగవలయునని తలంచి పాయ సమును వేఱువేఱుగఁగల్పించియిచ్చితిని. కాని, యిప్పుడుమీరు వానినిమార్చుకొంటిరి. నాసంకల్పము విపరీతమైపోయినది. మీసంతానముగూడ నట్లేకాఁగలదు." అనుటయు సత్యవతి "అయ్యో! పొరపాటుజరగినది. తపస్వినినగు నేనట్టిపుత్త్రునిఁబ డసి యానందింపఁజాలను." అని విచారింపఁ దొడంగెను. అప్పు డు రుచికుండు దయాళుండై "నీపుత్త్రుండు బ్రాహ్మణుండగు నట్లు ప్రయత్నించెదను. కాని, నీపౌత్త్రుండుమాత్రము క్షత్రి తేజస్సంపన్నుఁడుగాక తప్పదు."అని యూరడించెను.

అంతఁ గొంతకాలంబునకు సత్యవతికొకతనయుం డుద యించెను. ఆతఁడు క్రమంబుగఁబెఱిగి మునిచంద్రుండై జమ దగ్నినామంబునఁ బ్రసిద్ధుండయ్యెను.గాధిరాజునకుఁగూడ నప్పు డే యొకపుత్త్రుఁడు పుట్టెను.ఆతఁడు విశ్వామిత్రనామంబునఁ

బ్రఖ్యాతుండై యాభిజాత్యంబునుబట్టి రాజలక్షణంబులుగలవాఁ
డయ్యును తుట్టతుదకు బ్రహ్మర్షియైపోయెను.

ఆజమదగ్ని ప్రసేనజిత్తునిపుత్త్రికయగు రేణుకను బెండ్లి యాడెను. ఆమెకుఁ గ్రమముగ, రుమణ్వంతుఁడు, సుషేణుఁడు వసువు, విశ్వావసుఁడు, రాముఁడు ననునైదుగురుపుత్త్రులు గలిగిరి. వారిలో రాముఁడందఱికంటెను చిన్నవాఁడయ్యును గుణంబులచే నెల్లరికంటెఁ బెద్దయైయుండెను. వెనుకరుచికమునీంద్రుఁడు తనభార్యతో "నీపౌత్త్రుఁడు క్షత్రియతేజస్సంపన్నుఁడగు" నని చెప్పియుండెను. ఆక్షత్రియతేజస్సప్పుడు రామునియందు మూర్తీభవించెను. ఈరాముఁ డించుకవయస్సువచ్చినంతనే గంధమాదనంబునకుంబోయి మహాదేవునిఁగూర్చి కఠోరతపంబుఁగావించి, యాతనియనుగ్రహంబున ననన్యసాధ్యంబులగుదివ్యాస్త్రములంబడసి, త్రిభువనవిజయుండును, నద్వితీయుండును మహావీరుండునై విరాజిల్లుచుండెను. ఆతనితపంబునకు సంతుష్టుండై మహాదేవుం డద్భుతసాధనంబగుపరశువునుగూడఁ బ్రసాదించియుండెను. దానివాఁడి యెన్నఁడును మొక్కవోవునది గాదు. అయ్యస్త్రఘాతముచేఁ గఠినశైలంబులుగూడ ఖండఖండములైపోఁగలవు. నిరంతరము నాపరశువునుధరించి సంచరించుటచేతనే రామునకుఁ బరశురాముఁ డనుపేరు ప్రఖ్యాతంబయ్యెను.

పరశురాముఁడు బ్రాహ్మవంశమునందే జన్మించెనుగాని,

యాతనిమనసుమాత్రము క్షత్రియహృదయమువలె నతికఠినమైనదై యుండెను. అతనిహృదయ మెంతకఠినమైనదో యొకప్పుడుజరిగినసంఘటనమువలన స్పష్టముగాఁ దెలిసికొనవచ్చును. జమదగ్నిమునీంద్రున కొకనాఁడు రేణుకయందుఁ గారణాంతరముచే సహింపరాని దారుణక్రోధముకలిగెను. క్రోధావేశముచే నాతఁడొక్కసారిగనున్మత్తప్రాయుఁడై తనతనయులంబిలిచి తత్క్షణమే మీరామెను సంహరింపవలయునని కఠినముగ నాజ్ఞాపించెను. అతనిమొదటినలువురుపుత్త్రులునుగూడనిట్టియస్వాభావికంబును నతినిష్ఠురంబును,నధర్మయుక్తంబును నగుదారుణకృత్యంబున కొడంబడఁజాలకపోయిరి. కాని, పరశురాముఁడుమాత్రము తండ్రియాజ్ఞనాలకించినంతనే నిస్సంశయముగఁదనకరమునందలిగండ్రగొడ్డలిచే జననికంఠమును ఖండించివైచెను. పితృవాక్యపరిపాలకుండగు పరశురాముఁగాంచి జమదగ్నిసంతోషించి "వత్సా! నాయాదేశమాత్రంబున నీవతికఠినంబగు కార్యమును నిస్సంశయముగ నిర్వహించితివి. నీయెడలసంతుష్టుఁడనైతిని. నీకేమికావలయునో కోరుకొమ్ము" అనియనుగ్రహించెను.

పరశురాముఁ డప్పుడు జనకుని ప్రసన్నభావంబునకుఁ బరమానందభరితుండై "తండ్రీ! నీవు నాయెడలఁ బరితుష్టుండవైతివేని, క్రమ్మఱ నాజననిని బ్రదికించి మాతృఘాతుకుండను నపయశఃపంకమున మునిఁగిపోకుండ నన్నుద్ధరింపుము" అని వేఁడుకొనియెను.

జమ—కుమారా! అట్లేయగుఁగాక! ఇంకను నీకేమికావలయునో యడుగుము.

పరశు—తండ్రీ! నాకమరత్వమును బ్రసాదింపుము. మఱియు నీత్రిభువనంబులయందును నన్నుమించినమహావీరుఁడు లేకుండునట్లనుగ్రహింపుము.

జమదగ్ని సంతోషముతోఁ గుమారుని కభిలషితవరంబులఁ బ్రసాదించి పితృమాతృభక్తితత్పరుండవగు నీవు చిరంజీవివై మనుమని యాశీర్వదించి, పునరుజ్జీవితయై వచ్చి తనకు నమస్కరించినసహధర్మిణి నాదరించి శాంతుండయ్యెను.

అనంతరము గొంతకాలంబున కొకనాఁడు హైహయప్రభుండగు కార్తవీర్యుండు జమదగ్నితపోవనంబునకు విచ్చేసెను. అప్పుడు రేణుకాజమదగ్ను లిరువురుమాత్రమే తపోవనంబునందుండిరి. గృహిణియగు రేణుక యప్పుడు కుమారులింట లేకుండుటకు వ్యసనచిత్తయై యథాశక్తిగ నమ్మహారాజునభ్యర్చితుంగావించి కుశలప్రశ్నంబుఁజేసెను. కాని, గర్వోన్మత్తుఁడగు రాజయ్యాదరణంబును బరిగ్రహింపక యాశ్రమవనంబంతయు విధ్వస్తంబుఁగావించి బలవంతముగ జమదగ్ని హోమధేనువును బట్టి తీసికొనిపోయెను.

తరువాతఁ బరశురాముండింటికివచ్చి యెల్లవృత్తాంతము నాకర్ణించి ప్రళయకాలరుద్రునివలె మండిపడుచు నొకనిమిషమైన నాలస్యము సేయక పరశువును ధనుర్బాణములను

ధరించి వేగముగఁ గార్తవీర్యునివెదకికొనుచుఁ బోయి మార్గ మధ్యమునందే కలిసికొని యాతనితో మహారణంబుగావించెను. అంతటిదారుణసమరము నిదివఱకెవ్వరును వినియుండలేదు. కార్తవీర్యుఁ డప్పుడు ధనుర్బాణధారియయ్యును పరశురాముని కుఠారాఘాతములను దనవేయిచేతులచేఁగూడఁదప్పించుకొనఁ జాలకపోయెను. చూచుచుండఁగనే యమ్మహావీరునిపరశువు కార్తవీర్యునిసహస్రబాహువులనుఖండించి తుదకాతని యుత్త మాంగమును భూతలపతితంబుగఁ జేసివైచెను.

నిమిషములోఁ గార్తవీర్యునిమరణవార్త యతిదారు ణముగ నాతనిపుత్త్రులకుఁ దెలియవచ్చెను. హైహయవీరులగు నారాజకుమారు లప్పటినుండియుఁ బరశురామునియెడలఁ బగ దీర్చికొనుటకు సమయమును నిరీక్షించుచుండిరి. ఇట్లుండనొక ప్పుడు పరశురాముఁడు తనయన్నలతోఁగూడి యాశ్రమమును విడిచిపోయినసమయమునుగనిపెట్టియారాజకుమారులుతపోవన మునఁ బ్రవేశించి జమదగ్నిపైఁబడి "రామా! రామా!" యని యాక్రందనంబుసేయుచుండఁగనే యమ్మునీంద్రుని దారుణ వధగావించి వెడలిపోయిరి.

అనంతరము పరశురాముఁ డాశ్రమంబునకువచ్చి యా కూ్రరకృత్యముంగాంచి పితృమృతకళేబరముచెంత శోకార్తయై పడియున్నతల్లివలన నెల్లసంగతులను దెలిసికొని శోకానలసంత ప్తచిత్తుండైపోయెను. జనకునిగుణగణంబులం దలంచికొని

నుక్షించుచున్న కొలఁది నాతనిహృదయాంతరాళమునఁ గ్రోధానలము వర్ధిల్లుచు నతిభీషణముగఁ బ్రజ్వరిల్లఁదొడంగెను. ఈప్రపంచమునం దంతటిభయంకరక్రోధము నెవ్వరు నెచ్చటను గాంచియుండరు.

పరశురామునకప్పుడు జనకునికి దహనాదిసత్కారంబులుగావించుట ప్రధానకర్తవ్యమయ్యెను. తోడనే యాతఁ డక్కార్యంబులను ముగించి ధనుర్బాణంబులంబూల్చి యతిభీకరంబగుకుఠారంబును జేఁబూని మూర్తీభవించినమృత్యువుంబోలి హైహయకులసంహారంబుఁ గావించుటకై బయలుదేఱెను. కొలఁదిసేపటిలోనే శత్రునగరంబునకుఁబోయి యాతఁ డతిఘోరంబగు సంగ్రామంబు గావించి కార్తవీర్యతనూజులనందఱను దనపరశుధారచే ముహూర్తమాత్రంబున ఖండఖండములుగాఁ జేసివైచెను. కాని, యంతటితో నాతనికోపము చల్లారలేదు. పిమ్మట నాతఁడు హైహయవంశమునందలి క్షత్రియవీరులను వారివారియాశ్రితులనుగూడ వెదకివెదకి చంపివైచెను. ఇంకను గోపము చల్లారకుండుటచే క్షత్రియమాతృలనందఱను బేరులేకుండ నాశనంబు సేయవలయునని సంకల్పించుకొనియెను. ఈజగంబంతయు నక్షత్రంబగువఱకుమహావీరుఁడగు పరశురామునకు విశ్రాంతియనుమాటయే లేకపోయెను. క్రమముగా నాతనిచే జంపఁబడినక్షత్రియవీరుల వెచ్చనినెత్తురుకాల్వలచే ధరాతలమంతయుఁ బంకిలమైపోవుచుండెను. బాల

కులను శిశువులను గూడ నాతఁడువిడుచుటలేదు. ఈవిధముగా వెదకి వెదకి క్షత్రియులను పేరులేకుండఁ జేసివైచెను. అప్పటి కాతనికోపము శాంతించినది. తోడనే పశ్చాత్తాపదుఃఖమాతని హృదయమును గలంచివైచుటచే నాతఁడు నిలిచినచోటనిలువఁ జాలక, యరణ్యములఁబట్టిపోయెను.

అరణ్యములందున్నప్పుడుగూడ నాతనికప్పుడప్పుడహంకారము కలుగుచునేయుండెను. అప్పుడప్పుడు తపోవనంబులఁ బ్రవేశించి "నేనీభూమినంతయు క్షత్రియశూన్యంబుగాఁ జేసివైచితిని." అని యుగ్గడించుచుండెడివాఁడు. కాని, పరమశాంతులగుమునీంద్రులలోమాత్రి మట్టినిష్ఠురకార్యమున సంతుష్టింగాంచినవా రెవ్వరునులేకపోయిరి.

ఈవిధముగా వేయివత్సరములు గడచిపోయెను. దైవానుగ్రహముచేఁ బరశురామునిచేతులలోఁబడకుండఁ దప్పించుకొన్న యొకరిద్దఱుక్షత్రియశిశువులవలనఁ గ్రమముగాసంతానవృద్ధి వర్ధిల్లి మరల భూమియంతయు క్షత్రియజనసంపూర్ణమయ్యెను. అప్పుడు విశ్వామిత్త్రునిపౌత్త్రుఁడగుపరావసుండను వాఁడు పరశురామునిచెంతకువచ్చి "నీవేమో క్షత్రియులను నిశ్శేషముగాఁ జేసితి నని ప్రగల్భము లాడుచున్నాఁడవు. అదిగో చూడుము! జగంబంతయు మరల క్షత్రియసంపన్నంబైయున్నది. పరమేశ్వరుని సృష్టినడ్డగించుటకు నీవెంతవాఁడవు." అని పరిహసించెను.

ఇంతవఱకును బరశురామునిహృదయాంతరాళమున ముఱుగువడియున్నరోషానల మిప్పుడొక్కసారిగఁ బ్రభూమితమై ప్రజ్వరిల్లిపోయెను. ఇఁక నాతఁడు వనమధ్యమునం దూరక యుండఁ జాలక జనపదములయందుఁబడి వెదకి వెదకి మరల క్షత్రియులనందఱను సంహారించివైచెను. ఈవిధముగా నాతఁ డిరువదియొక్కమాఱు క్షత్రియసంహారముఁ గావించెను. ఆక్షత్రియరక్తమంతయు శమంతపంచకమనుపేర నైదుమడుగు లయ్యెను. అందలిరక్తముచేఁ బరశురాముండు పితృదేవతలకుఁ దర్పణంబులు గావించి కోపమును జల్లార్చుకొనిపోయెను.

ఈభూమండలమున కంతకును బ్రభువులగువారు క్షత్రియులేయైయుండిరి. పరశురాముఁడు క్షత్రియవినాశనంబుఁ గావించుటచే ధరాతలమంతయు నాతనియధీనమయ్యెను. కాని, యాతఁడు రాజ్యలోభముచే క్షత్రియసంహారముం గావించి యుండలేదు. రాజ్యమువలన నాతని కెంతమాత్రమును బ్రయోజనము లేదు. క్షత్రియసంహారానంతరమునఁ బాపవిమోచనంబునకై యాతఁ డొకయశ్వమేధయాగమును గావించెను నిరపేక్షుండగు నాతఁడయ్యజ్ఞ సమయంబున మహర్షియగు కశ్యపునకీమహీమండలమంతయును మఖదక్షిణగా సమర్పించివైచెను. లోకమహితులగు నితరమునులవలెనే కశ్యపుఁడుగూడఁ బరశురాముని దారుణకృత్యములకు సహింపఁ జాలకుండెను. కశ్యపుఁ డప్పు డాభూదానమునుగ్రహించి రాజ్యపాలనమున కేర్పడిన క్ష

క్షత్రియవంశము నుద్ధరించుట కిదియే నుంచిసమయమనితలంచి పరశురాముంగాంచి దక్షిణాభిముఖంబుగ నంగుళింజూపుచు, "మహాత్మా! నీవిప్పుడే యీమార్గమును బట్టి దక్షిణసముద్ర తీరంబునకుంబొమ్ము; నీవు దానముసేయుటచే నీసమస్త భూమండలము నాయధీనంబైనది. దాతవగునీవిక నిందుండుట యుచితముగాదు." అని చెప్పెను.

పరశురాముండును మాఱుమాట చెప్పక యాక్షణము ననే బయలుదేఱి దక్షిణసముద్రతీరమునకుంబోయెను. ఆతనిం గాంచినంతనే సముద్రుం డించుక వెనుకకు జరిగి యాతనినివాసంబునకై శూర్పాకారంబుగఁ గొంతభూప్రదేశమును గల్పించెను. పరశురాముఁ డచ్చట తపంబుఁ జేసికొనుచుఁ బ్రశాంతుండై యుండెను.

అనంతరము లోకమంగళాకాంక్షి యగుకశ్యపమునీంద్రుఁడు పలాయితులై యందు దాగియున్నక్షత్రియకుమారులం దెచ్చి ఆయారాజ్యంబులయందుఁ బ్రతిష్ఠించి యరాజకంబగు లోకంబును ధర్మపాలనరూపంబున సముద్ధరణంబుఁ గావించెను.

ఇట్లు పరశురాముండుప్రశాంతుండైయుండినను జాలకాలమువఱకు నాతనిసన్నిధి కెవ్వరును జేరఁజాలకుండిరి. కాని,క్రమముగా భయమువిడిచి,రాజకుమారు లాతని నాశ్రయించి ధనుర్వేదాదివిద్యల నభ్యసించి పరాక్రమవంతులు కాఁజొచ్చిరి. దుష్టరాజన్యకులధూమకేతువగు పరశురాముని నిత్యమును

బూజించుట శ్రేయోదాయకమని భావించి ధర్మపరిపాలకులగు ననేకమహారాజులు దమతమసంస్థానములలో దేవాలయముల గట్టించి పరశురామమూర్తులను బ్రతిష్ఠించి నిత్యమును యథావిధిగ నర్చించుచుండుటకుఁ దగినవసతులనుగూడఁ గల్పించియుండిరి. ఇప్పటికిని గొన్ని సంస్థానములయందుఁ బరశురామాలయములు చూపట్టుచున్నవి.

పరశురాముఁ డొకప్పుడు భూసంచారము సేయుచు విశ్వామిత్రాశ్రమమునకుం బోయి యమ్మునీంద్రుఁడు రామలక్ష్మణసహితుండై ధనుర్యాగనిరతుండగు జనకుని జూడఁబోయెనని శిష్యులవలనఁ దెలిసికొని, మిథిలానగరమునకుఁ బయనమయ్యెను. త్రోవలో నాతనికి విజయభేరీధ్వనులు మంగళతూర్యారావములును వినవచ్చెను. రఘుకులతిలకుండగు రామచంద్రుఁడు శివధనుర్భంగంబుఁజేసి సీతాదేవిని బరిణయంబై మహోత్సవంబున నయోధ్యానగరంబునకుఁ బోవుచుండెనని యాతనికిఁ దెలియవచ్చెను. అప్పుడు పరశురాముఁడు కన్నులనుండి నిప్పులఁగుప్పుచుఁ గ్రోధోద్రేకంబున రాముని సమీపించి "నిఖిలక్షత్రియకులనిర్మూలనకఠోరకుఠారుండనగు రాముఁడను నేనుండఁగా మరల రామనామధారివగునీవెవ్వఁడవు? శివునిచివుకువిల్లువిఱిచి వీరగర్వాంధుఁడవై కులుకుచుంటివా? నిలునిలువుము! రామనామంబునకర్హులము నీవో నేనోచూతువుగాక!" అని యదలించుచు రాముని నడ్డగించెను.

దశరథుఁ డెన్నియో విధములఁ బరశురాముని శాంతింపఁ జేయఁ బ్రయత్నించెనుగాని ప్రయోజనము లేకపోయెను. అప్పుడు శ్రీరామచంద్రుఁడు పరశురామునకు నమస్కరించి "ఆర్యా! మీప్రభావము జగద్విదితమైనదని యెఱుంగుదును. పవిత్రబ్రహ్మవంశమున జన్మించి యెవ్వఁడో యొకరా జనుచితకార్యముఁ గావించినాఁడనుకోపముచే రాజలోకమునంతను నిర్మూలనంబు సేయందలంచి కిరాతుండు సాధుమృగంబుల హింసించినట్లు ఘోరమారణకర్మంబులఁ గావించినమీప్రతిష్ఠ యెఱుంగనివా రెవ్వరు? భూమండలమున నిప్పటికిని గూడ నింకిపోకుండ నగాధములై తరంగితములగుచున్న రక్తపుమడుగులే మీకీర్తి నాచంద్రార్కముగఁ జాటుచున్నవి." అనియుగ్గడించెను.

పరశురాముఁ డప్పుడు మహాక్రోధముచే "ఓరీ! రాకుమారా! పురాతనమైన శివచాపము నెక్కువెట్టుటగాదు. నాయొద్దనున్నయీవైష్ణవచాపంబు సజ్యంబుగఁ జేయుము. నీశక్తిచూచెదన్; అట్లుచేయఁజాలకుంటివేని, ఈపరశువుతో నీశిరఃఖండనంబుఁ గావింతును." అని గద్దించెను.

రామచంద్రుఁడు మందహాసముఁ జేయుచు వినతుండై యాతనికోదండముం గైకొని యశ్రమంబుగ నెక్కువెట్టి శరసంధానము చేయుటయుఁ బరశురాముం డాశ్చర్యంబునొంది